శ్రీరస్తు.

# గౌరీశ్వరపూజావిధాన సంకీర్తనలు

అను

## శ్రీ బాలాత్రిపురసుందరీ వరదేవతాస్తవపాటలు.



ఇవి

గుంటూరు జిల్లా బాపట్ల నివాసస్థులును, శ్రీ [illegible]

బ్రహ్మండం బాపయ్యపంతులుగారి కుమారులును నగు,

బ్రహ్మండం వేంకటలక్ష్మీనారాయణరావుపంతులుగారి

వ్రాసిన సహాయమువలన

గుంటూరు జిల్లా, ఒంగోలుతాలూకా

నిప్పుగుంటూరి వాస్తవ్యుడు

షూలి సుబ్బారావుచే

రచించి ప్రకటింపబడెను.

మొదటికూర్పు 2,000 ప్రతులు

కాకినాడ.

స్కేప్ అండు కో., శ్రీ క. సుబ్బారాయుడు బ్రదర్సువారి వలన

ముద్రింపబడియె.

1922

 [వెల రు 0—8—0.

శ్రీరస్తు.

# పీఠిక.

ఆర్యులారా!

గుంటూరుజిల్లా బాపట్ల పురవరంబున శ్రీభావనారాయణస్వామివారి ఆలయములో బాటు శ్రీసోమేశ్వరస్వామివారి దేవాలయమున్ను, పూర్వము మహారాజ రాజశ్రీ శ్రీ రాజా కాండ్రేగుల జోగిజగన్నాథరావు బహద్దూరు సర్కారు రాజమహేంద్రి గారు ప్రతిష్ఠ కావించియుండిరి. శ్రీయుత బ్రహ్మాండం బాపయ్య పంతులుగారు సదరు ఈశ్వరాలయమున వేరొకచోట శివప్రతిష్ఠ గావింప నిశ్చయించుకొని సంకల్పసిద్ధి గాకముందే కీర్తిశేషులగుటయు, తదనంతరము పంతులవారి సతీమణి రామాబాయమ్మగారున్ను, వారిసుపుత్రుడు వేంకటలక్ష్మీనారాయణరావుగారున్ను, పంతులవారి యాప్సితమును నెరవేర్పదలచి నళనామసంవత్సర ఫాల్గుణశుద్ధ ౯లు అప్పట్లో బాపట్లయందు నివసించియుండిన తద్గ్రామమును, దేవాలయమును, మహోన్నతదశ తెచ్చిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీబ్రహ్మానందతీర్థస్వాములవారి ద్వారా శ్రీఅభినవ సోమేశ్వరస్వామిని, శ్రీబాలాత్రిపురసుందరీ పరదేవిని, ప్రతిష్ఠ గావించియుండిరి. గౌరీశ్వరులకు ప్రతిసంవత్సరము చైత్రశుద్ధ ౧౧ ప్రభృతి కల్యాణము జరుపుచున్నారు. శ్రీబాలాత్రిపురసుందరీ పరదేవికి ప్రతిశుక్రవారము పూజయు జరుగుచుండును. తల్లి కుమారులు చేయు సత్కార్యములు కనుపరింపసాధ్యములు. వీరు అనేకమంది బీదలకు వివా

హోపనయనములు చేసినవారలు. విశేష దైవకార్యములు చేసినవారలు. వీరుచేయునట్టి మహోపకారములు కనివినిన వారలకే గోచరములుగాని వ్రాయుటకు వీలైనవిగావు. ఇట్లు లుండగా వేంకటలక్ష్మీనారాయణరావుగారు నన్నుతిలకించి అమ్మవారిమీద కొన్నిపాటలు, కీర్తనలు రచించమనియు, వాటి అచ్చుకగు ఖర్చుయిచ్చెదననియు చెప్పినందున, అందు నకు అసమర్థుడనయ్యు, వారిపట్టుదల త్రిప్పజాలక, నేను రచించుటయు, వారు ముద్రింపించుటకు సహాయముచేయు టయు, జరుగునుగదా! ఇకను మిగిలినది కష్టమునకు తగుఫలి తమొకటేకదా మనకు కావలసినది; దేవీకటాక్షము చక్కగా యుంటేప్రాప్తించకబోవునా? యని యికార్యము నెరవేర్చ సాహసించిపూని ముగించితిని. తగిన భాషాజ్ఞానముకలవాడను కానందున యిందనేక తప్పులు కలిగియుండవచ్చును. కుశా గ్రబుద్ధియుతులు అట్టివాటి నన్నిటిని దిద్దియు, తెలిపియుయుం డీన రెండవకూర్పునందు సవరించుకొందును. ఈకృతికి కర్త యైన శ్రీయుత బ్రహ్మాండం వేంకటలక్ష్మీనారాయణరావు పం తులుగారికి నిరంతరము ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిగాగ లుగులకు దైవమును ప్రార్థించుచున్నాను. ప్రార్థముపుండీన యిశోకగ్రంథమును రచించి దేవి సన్నిధియందర్పించదలచు కొని యున్నారు.

ఉప్పుగుండూరు,
ఒంగోలు తాలూకా

ఇట్లు విన్నవించు విధేయుడు,
ఘాలి సుబ్బారావు.



శ్రీరస్తు.

శ్రీపరదేవతాయై నమః

# శ్రీగౌరీశ్వరపూజావిధానసంకీర్తనలు.

## విఘ్నేశ్వర ప్రార్థన.

కమాసురాగము - త్రిశ్రజాతి ఏకతాళము.

(శ్రీరాగాల, వైరి)



గణపతిదేవా । స్మరియించెద ననుగావా । నాగయజ్ఞసూత్రనమల ధారణమహానుభావా ॥ శ్రీ ॥ అమరవినుతపాత్రి । అఖిలకళానిష్ణాత । అమితగుణవిభూషకర । ఆర్యప్రణుత శక్తిపుత్రా ॥ శ్రీ ॥ విఘ్నములను బాపు । సర్వవిఘ్నముగను కృపజూపు । విఘ్నరాజ విమలహృదయ వేగ జేర్చునను ప్రాపు ॥ శ్రీ ॥ ఆఖువాహన రారా । అఘములణచ వేరా । మఘవలాదివంద్యమాన్య చరితమేరుసమసుధీర ॥ శ్రీ ॥ భావపురీనివాసా । భవసంహారదరహాస । అవని ఘూలిసుబ్బరాయ దాసపోష సరసభావ ॥ శ్రీ ॥

—♦ సరస్వతీ ప్రార్థన ♦—

2 రామప్రియరాగం - ఏకతాళము.

(యీరాజావళి, మట్టు)

వాణీగొలచెద నిను గీర్వాణీవీణాపుస్తక। పాణీఅళికులవేణీ సరసిజరాణీ॥ వా॥ కోరివేడితినీవిక। జేరిననుదయగనుమిదె॥ వా॥ వాదానీకృపనాపైరాదా సాధుజనావని॥ వా॥ భావాపురమున వెలసియుగావా మదిగనలేవా॥ వా॥ ఘూలిసుబ్బార్చితగుణశాలీ పాలితధరనయశాలీ॥ వా॥

—♦ శ్రీభావనారాయణస్వామివారి ప్రార్థన ♦—

3 శహానరాగం - ఆదితాళము.

(కేదళాస్త్రములు, మాదిరి)

భావనారాయణంభజేహంశ్రీ॥ భా॥ పావనచరితంపాపవిదూరంశ్రీ॥ భా॥ సృష్టిస్థితిలయకార్యాకారణం। దుష్టసంహారణం ధారుణీరమణం॥ భా॥ ఆదిమధ్యాంతరహితచరితం। సాధుజనావనంసన్మునివినుతం॥ భా॥ భావపురాంతరభవ్యసద్విహారం। సేవకజనఫలదాయకంధీరం॥ భా॥ లాలితగుణవనమాలివిశేషణం। ఘూలిసుబ్బరాయాఖ్య సుపోషణం॥ భా॥

—♦ శ్రీలక్ష్మీస్తవము ♦—

4 ముఖారి - త్రి. ఏకతాళము.

(శ్రీహరిహరీ, మట్టు)

శ్రీరమామణీ మురారిసతినమోస్తుతే। సారసాకృతే।

సాధువందితే॥ శ్రీ॥ క్షీరజలధితనయ సుగుణసదయమానినీ। దురితహారిణీ। దనుజమర్దనీ॥ శ్రీ॥

దారిద్ర్యధ్వంశనీసమస్తమానిపోషణీ। హారధారిణీ। అంబుజేక్షణీ॥ శ్రీ॥ భావపురనివాసినీ భయాపహారిణీ। సేవకావనీ। శ్రితజనావనీ॥ శ్రీ॥ ఘూలిసుబ్బరాయదాసకవితవందిత। లలితమ్మృదుపదా। నళినకరసదా॥ శ్రీ॥

—♦ ఈశ్వరస్తుతి ♦—

5 తోడిరాగం - ఆదితాళము.

(గంగాధరావన్నా గావరా, మట్టు)

సోమేశ్వర దేవబ్రోవుమా భక్త। కామితఫలప్రద గావుమా॥ సో॥ గంగాధరుడనైయుంటివు। జగ। న్మంగళకరుడవనబరగుదువు। అంగజహతుడనై నెగడొందుదువు। నంగ। భంగుడవని పేరువడయుదువు॥ సో॥ త్రిపురసుందరీ ప్రాణవల్లభ। అల। త్రిపురసంహారమహాప్రభ। తపనశతకోటిసమసన్నిభ। భవ। పాపసంహారకయోగశుభ॥ సో॥ భావపట్లపురనిలయశంకర। వర। తాపసలోకవశంకర। కృపజూపుశత్రుభయంకర। ఘూలి। సుబ్బాఖ్యదాసాఘసంహర॥ సో॥

6 సురటరాగము - ఝంపతాళము

(రవికులసోమా, వలె)

అభినవసోమేశ్వర దేవ దేవునకభివాదమును చేసెదః। విభవము గనుగూడగ। వినుతులకిదు మెచ్చగ॥ అ॥ ప్రమ

భగణనుతునకుభక్తి తత్పరునై ప్రణమిల్లి ప్రార్థించెదర । కామితములవేడెదర । కరుణించమనికోరెదర॥ అ॥ ఓంనమః శివాయయనునామజపమును నేప్రొద్దునొనరించెదర । పన్నగ భూషునకుర । సన్నుతులనుచేసెదర॥ అ॥ రుద్రమూర్తికి కన కదుర్గాప్రియునకు రుద్రాక్షరజపమాలునకుర । చిదూప్రు నకు శివునకుర । శిష్టజనవత్సలునకుర॥ అ॥ బ్రహ్మాండం వెంక టలక్ష్మీనారాయణ ప్రణుతార్తిహరుహరునకుర । బ్రహ్మా నందమయునకుర । బాపటనిలయునకుర॥ అ॥

—♦ శ్రీ బ్రహ్మానందతీర్థస్వాములవారి ప్రార్థన ♦—

7 సింధుకమాంచి - ఏకతాళము.

([illegible])

బ్రహ్మానందగురుర । భజనుసేదసర్వార్థుర॥ శ్రీబ్ర॥ బ్రహ్మజ్ఞానుని బ్రహ్మవేత్తను । బ్రహ్మానంద పరబ్రహ్మవిచా రుని॥ బ్ర॥ దండకమండలధారుర । పండితజనఆహ్లాదుర । కుండలినియనక ధామృతతత్పరు నఖండనభినవోద్దండమహిమ హు॥ బ్ర॥ ఆర్యజనావనసేవ్యుర । ధైర్యునియోగప్రకాశుర । పరమహంస శ్రీపరివ్రాజకాచార్య వర్యగుణ ధుర్యస్థైర్యు నిర॥ బ్ర॥ వరసుబ్బాఖ్యునివినుతుర । సురుచిరగుణనికరుర । ధరబాపట్ల పురంబున వెలసియు అనసినవారలకిహాపర మిచ్చిన॥ బ్ర॥

## 8 ఖరహరప్రియ - ఏకతాళము.

(శిరి, గ, ఘ్నా, శా, మస్తు.)

ప్ర, హ్లా, వం, ద, త్రిపురస్వామి వినుతిచేసెదర । భక్తి మీఱగర । భజన జేసెదర॥ ప్ర॥ శి, ష్టా, చా, రా, శ్రితజ నానుమోదశ్రీకర । శిష్యవత్సలా । శరణుగొనుబులా॥ ప్ర॥ శ్రీ, గా, లా, ర్యా, తేజ నీజనప్రపూజితాపదా । సేవగొనుసదా । సమయుమిదేకదా॥ ప్ర॥ కా, రు, ణ్యా, సా, గర సమస్తశాస్త్రిసైపుణా । మానధనఘనా । మధురభాషణా॥ ప్ర॥ భా, వా, పు, రీ, జనవినోద అఘువిమోచన । నతజనావన । యఖిలపావన॥ ప్ర॥

## —♦ శ్రీబాలా త్రిపుర సుందరీ పరదేవతా ప్రార్థనలు ♦—

### భైరవి రాగం - ఆటతాళము.

(శ్రీగౌజర క్రేశ్వరి. మాలి.)

శ్రీబాలాత్రిపుర । సుందరినమోస్తుతే ।। సౌభాగ్యదాయిని । శుభగుణభూషితే॥ శ్రీ॥ వినుతుగొనరించెద । విజ్ఞానదాయినీ । కనికరముననిబ్రోవు । కనకాద్రివాసినీ॥ శ్రీ॥ భక్తమనోభీష్ట । ఫలదాయినీజననీ । మౌక్తికధారిణీ । ముక్తిప్రదాయినీ॥ శ్రీ॥ శ్రీమద్భానపుర । చిరమునివాసిని । సోమశేఖరు రాణి । సుజనవినోదిని॥ శ్రీ। పాలితాఖిలభువని । పాపనిర్మూలిని । ఘూర్ణసుబ్బాపతి । [illegible]జనీ॥ శ్రీ॥

—♦ షోడశోపచారములు ♦—

## ధ్యానము.

### 2 కేదారం - ఆదితాళము.

(సంతతం సుశాంత, శైలి.)

ధ్యానమును జేసెద గనుగొనుమా । శ్రీత్రిపురసుందరి॥ ధ్యా॥ జ్ఞానరూపిణిజ్ఞానఖని సుజ్ఞానదాయిని జ్ఞానవర్ధని । ధ్యాన ధ్యాతృధేయరూపాజ్ఞానధ్వంశిప్రజ్ఞావిశేషిణి॥ ధ్యా॥ చారు చంద్రకలాధరా శ్రీచక్రరాజనికేతనారిపు । చండతరదోర్గండ మండన । చారుచతుర్బాహునైపుణ॥ ధ్యా॥ మానినుతబాపట్ల పురవర మందిరాంతర విహారిశంకరి । ధ్యానగమ్యధీశరణ్యా । ఘూలిసుబ్బరాయనుతపద॥ ధ్యాన॥

### 3 ఆవాహనము.

హిందుస్తాని - ఏకతాళము.

(కైసీఖంకే హైబాత్, మట్టు)

ఆవాహనము జేసెదా । నగజాతరమ్మా॥ ఆ॥ భావన గమ్య భక్తిసౌభాగ్యిని । భవారణ్యదహనీ । నగజాతరమ్మా॥ ఆ॥ మంగళదాయిని మంజులభాషిణి । సంగీతామృతాలోల । నగజాతగమ్మా॥ ఆ॥ సర్వభూతహిత సకలజగన్నుత । శర్వాణి మునిసంస్తుత । నగజాతరమ్మా ॥ఆ॥ భావపురీశ్వరి భాగ్యవిద్యేశ్వరి । అవనీశ్వరీయూశ్వరీ । నగజాతరమ్మా॥ ఆ॥ బాలాత్రిపుర సుందరి దేవి । జలజాయతాలోచనీ । నగజాతరమ్మా॥ ఆ॥ వెం

కట లక్ష్మీనారాయణస్తుతిపదా । సంకటహారణసదా । నగ
జాతరమ్మ॥ ఆ॥

4 ఆసనము.

యమునా కళ్యాణి - ఆదితాళము.

(తాండవ నృత్యకరి, మాదిరి)

ఆసనమిదెగనుమా । కాత్యాయని సిం॥ హాస॥ భాసు
రగుణ మనోల్లాసిని సదయా । విశుద్ధచక్రనిలయా । కాత్యా
యని సిం॥ హాస॥ నవరత్నాంచిత మణిమయబంగరు । ప్రవర
మపీఠమిదే । కాత్యాయని సిం॥ హాస॥ శ్వేతపద్మాసనమాత
రొగొనుమా । శ్వేతాద్రిజాతా । కాత్యాయని సిం॥ హాస॥
స్థిరముగ బాపట్లపురవరనిలయా । సర్వాయుధధారీ। కాత్యా
యని సిం॥ హాస॥ వెంకటలక్ష్మీన్నారాయణ శర్మహృ । త్పం
కజదళవాసీ । కాత్యాయని సిం॥ హాసన॥

5 పాద్యము.

ముఖారి - ఆదితాళము,

(హారతి గైకొనుమా, పణితి.)

పాద్యముగైకొనుమా । అనాద్యవిద్య॥ పా॥ విద్యా
విద్యస్వరూపిణిమధ్యమా । హృద్యవేద్యవేద్యా । అనాద్యవి
ద్య॥ పా॥ సర్వతీర్థజల । సమన్వితమానిల । సర్వపాపహారణీ।
అనాద్యవిద్యా॥ పా॥ పద్మరాగసమప్రభా భాసిత । పద్మన
యనచరితా । అనాద్యవిద్యా॥ పా॥ సద్యశోభున్నత । పాద

పంకజ । ద్వంద్వమహావేద్యా । అనాద్యవిద్య॥ పా॥ వాసిగ బాపట్లవాసిన శూలిని । దోషపరీహారీ । అనాద్యవిద్యా॥ పా॥ బాలాత్రిపురసుందరిదేవి । క్రాళీరణకేళీ । అనాద్యవిద్యా॥ పా॥

### 6 అర్ఘ్యము.

(ఏమనిదెల్పుదు రా, వలె.)

అర్ఘ్యముగైకొనుమా । అద్రిప్రియసుత॥ అ॥ అర్ఘ్య వాంఛితానర్ఘ్యసత్వ సంపూర్ణప్రసన్నఉమా । అద్రిప్రియ సుత॥ అ॥ గంగాజలసమానతసుగంధ । గంధసంయుతఘన సారం । అద్రిప్రియసుత॥ అ॥ పల్లవకరయుగ సల్లలితాంచిత। ఫుల్లసరోరుహనేత్రి । అద్రిప్రియసుత॥ అ॥ ధాముణిబాపట్ల ధామగిరీశ్వరి । వరశ్రీత్రిపురసుందరీ । అద్రిప్రియసుత॥ అ॥ వెంకటలక్ష్మీనారాయణ నుతపద । సంకటదూరసదా । అద్రిప్రియసుత॥ అ॥

### 7 శుద్ధాచమనీయము.

బేహాగ్ - ఆదితాళము.

(చూడవియాసభ, వలె)

ఆచమనంబును ఆచరింపుమా । మేచకాంగివర మేరున గసుత॥ ఆ॥ శుద్ధోదకములు శ్రద్ధతనిచ్చెద । యుద్ధతదానవ యుద్ధరంగహత॥ ఆ॥ సర్వాతీతాశాశ్వితైశ్వర్యా । సర్వాభ రణభూషితగుణధుర్యా॥ ఆ॥ ఇలబాపట్లనివాసిని ధీమతి । బాలాత్రిపురసుందరిపరదేవి॥ ఆ॥ వెంకటలక్ష్మీనారాయణ వందని । శాంకరిప్రీతపర్యంకసుశాయిని॥ ఆ॥

8 పంచామృతము.

జంఝూటి - రూపకము.

(వంటివాడమున్నము. వలె)

పంచామృతస్నానమాచరించుమగౌరీ । చంచలాక్షిసేవలుతిలకించుకౌమారీ॥ పం॥ మధురాధరిమృదు మధురసభాషణీయుమా । దధిమధుగోక్షీరశర్కరాజ్యసహితమా॥ పం॥ సామగానప్రియవరా రాధ్యముక్తిదా । కామరూపిణీమహేశ్వరీసౌభాగ్యప్రదా ॥ పం॥ భావపురినివాసినీశ్రీత్రిపురసుందరీ । అవనిలక్ష్మీనారాయణపాపసంహారీ॥ పం॥

9 శుద్ధోదకస్నానము.

భైరవి - ఆదితాళము.

(నామనవినిని ను, మాదిరి)

శుద్ధోదకస్నానముని దె జేయుమా । సిద్ధేశ్వరివిశుద్ధచక్రనిలయయుమా॥ శు॥ బంగరుకలశానీతమనోజ్ఞల । గంగాదిసరిదుద్భవమగునీజల ॥ శు ॥ మృగమదఘనసారాదిహారిద్రా । అగదమనారికేళోదకసహిత॥శు॥ పొంకముగాబాపట్లనివాసితే। వెంకటలక్ష్మీనారాయణసంస్తుతే॥శు॥

10 వస్త్రము.

ఖమాసు - ఆదితాళము.

(అద్యజనా బల, మాట్లు)

వస్త్రయుగ్మమును ధరియించుమడుమ । శాస్త్రసార సద్భక్తమందారమ॥ వ॥ పీతాంబరధరిపీతాంబరమిదె । పీతాం

బరసహోదరికౌమారి॥ వ॥కనకకంచుకము ఘనముసుందరము। కనకాద్రినివాసిని కాత్యాయని॥వ॥భావపురీశ్వరిభవమనోవిహారి। సేవకాంతరంగిణిముక్తేశ్వరి॥ వ॥ సంకటనాశని।సాధుసంతోషిణి। వెంకటలక్ష్మినారాయణపోషిణి॥ వ॥

## 11 యజ్ఞసూత్రము.

జంఝూటి - రూపకము.

సువర్ణయజ్ఞసూత్రమిదేస్వీకరింపుమా। శివమనోబ్జవిహారభ్రమరివినుతులెంచుమా॥సు॥నాగియజ్ఞోపవీతినీనిరంజనీ। ఆగమాంతరూపిణీయమోఘకారిణీ॥సు॥ త్రిపురసుందరీమహేశ్వరీకళానిధీ। తాపసేంద్రపోషణీదయామహాంబుధీ॥ సు॥ శుభవతిబాపట్లపురనివాసినీమణీ। లోభనాశనీలక్ష్మినారాయణావనీ॥ సు॥

## 12 తిలకము.

ముఖారి - ఆదితాళము.

(మో: పనిజనుమిక, ఘణిలీ)

తిలకముబెట్టుదునోత్రిపురసుందరీ। కలికిచిలుకలకొలికీ మహేశ్వరీ॥ తి॥ పూర్ణచంద్రముఖిఅగరుహరిద్రా। చూర్ణము వరమృగమదసమ్మిళితా॥తి॥ పాదసరోజములకుపసుపిడుదునే। వేదాంతార్థపువేదివీవనగనే ॥ తి ॥ కమలములనుగేరుకన్నుదోయికి। అమరగకాటుకనలదెదనోసఖి॥ తి॥ శూలినిబాపట్లసాధువిహారిణీ। ఘూలిసుబ్బరాయాఖ్యసుపోషిణి ॥ తి ॥

## 13 గంధము.

జంఝూటి - ఏకతాళము.

(జేడీవాసుగా, మత్తు)

గంధామందుమా । త్రిపుర । సుందరియుమా॥ గం॥
కుందారదనశరదిందువదన యోమందగజగమన । బృందార
కాదిసద్వందితపద్భక్తవందారుమందారమా॥ గం॥ అగరుకుం
కుమపువ్వు అరుదైనచందన మునురెరు నిదియొంచుమా । మృ
గమదఘనసారమిశ్రితమగునిదె ముఖ్యముగాగాంచుమా॥ గం॥
బాపట్లపురదివ్యభవ్యవిహారిణి బాలాత్రిపురసుందరీ । తాపస
వందిత దైత్యవినాశని ఘంటిసుబ్బరాయ కవిదాసవందిత॥ గం॥

## 14 ఆభరణములు.

పూరీకల్యాణి - మధ్యాదితాళము.

(గిరివాసుకా, పాహి)

ఆభరణముల । నందుమా గిరిబాల॥ ఆ॥ శుభగుణసు
శీల । సుజనసంఘపాల॥ ఆ॥ సుందరమంజీరముల్ । మణిహార
మాలల్ । కంజాక్షినవరత్న । కరకంకణముల్॥ ఆ॥ అంగు
ళీయకకేయూరకిరీటముల్ । బంగారువడ్డాణంబు వజ్రసర
ముల్ । ఆ॥ సురుచిరరత్న । స్థగితకంఠమాలల్ । అరుదైన
నాశి । కామౌక్తికంబుల్॥ ఆ॥ కర్ణమునను కమ । నీయకుండ
లంబుల్ । స్వర్ణతీర్ణసమున । జూడచోద్యమాబల్॥ ఆ॥ బా
లాత్రిపురసుం । దరిలోకమాత । ఇలఘంటిసుబ్బరాయనసం
సుతా॥ ఆ॥

## 15 మాల్యము.

(రాదములమః డు, వలె)

హారములనుగొనుమిదె త్రిపురసుందరీ । సారసాకారిణీసాధుసద్వేశ్వరి॥ హా॥ జాజులు సన్నజాజులు విరజాజులు । రోజములనుగని తేజముమీరగ॥ హా॥ మల్లెలు మొల్లలు మంచిసంపెంగలు । తెల్లజాజులనుగూర్చియువల్లిన॥ హా॥ తమ్మిచెంగల్వలు కల్వతమాలలు । తుమ్మిచేమంతులు పారుజాతముల॥ హా॥ కాంచనకేతకి కనకహింతాల । మంచిమంజూత్పల । చంపకసాలా॥ హా॥ వకుళమందారయశోకనారంగ । శ్రీకరి ఘూలిసుబ్బార్చితమార్గా॥ హా॥

## 16 అక్షతలు.

పూరి - ఏకతాళము.

(అక్షయమని, నూరిది)

అక్షతలర్గొనుమా । దాక్షాయణి దయగనుమా॥ అ॥ సాక్షిస్వరూపిణి సర్వాంతర్యామిని । మోక్షకారిణీమునిజనాహ్లాదిని॥ అ॥ అక్షతధవళితశుభ్రితనమ్రిత । వీక్షించుము దయాకటాక్షవీక్షణీ॥ అ॥ అర్చనసుమతతి అఖిలంబులయినె । చర్చయేల హరిద్రాచూర్ణము గనుమిదె॥ అ॥ బిల్వముమిదె భవభంగవినాశని । బిల్వనవమహాహ్లాదవిహారిణి॥ అ॥ శంకరహిత బాపట్లనివాసితే । వెంకటలక్ష్మీనారాయణపూజితే॥ అ॥

17 పూజ.

ముఖారి - ఆదితాళము.

(పాః ఆగ్రగొనుమా, మో స్తరు)

పూజనుగైకొనుమా । గౌరిసర్వాంగ॥ పూ॥ పాదజానుకటినాభిస్తనస్థలి । భుజద్వయగాత్రిముఖా । శిరముసర్వాంగ॥ పూ॥ సుందరిప్రథమప్రగంధాదిషోడశ । గ్రంథపర్యంతరము। గౌరిసర్వాంగ॥ పూ॥ ఆయుధసేవనువాహనసేవను। జేయుదునిదెగనుమా । గౌరిసర్వాంగ॥ పూ॥ బాలాత్రిపురసుందరిపరదేవి । జలజనయనకౌమారి । గౌరిసర్వాంగ॥ పూ॥ భావపురీశ్వరి । భక్తముక్తేశ్వరి । శివమానసవిహారి । గౌరిసర్వాంగ॥ పూ॥ వెంకటలక్ష్మినారాయణవందిత । శంకరహితశుభదా । గౌరిసర్వాంగ॥ పూ॥

18 ధూపము.

ముఖారిరాగం - ఆదితాళము.

ధూపమునాఘ్రాణించుముదేవి । పాపవినాశని పరమపావని॥ ధూ॥ ఘనసారము చందనమగరుఘృతం । ఘనగుగ్గులమును కోష్టసంయుక్తం॥ ధూ॥ చంద్రసూర్యాగ్నిలోచననవచండీ । ఇంద్రనీలమణిహారచాముండి॥ ధూ॥ సర్గోన్మాదిని సర్వజృంభిణీ । సర్వాహ్లాదిని సర్వసమ్మోహినీ॥ ధూ॥ పోలగశాపట్ల పురసద్విహారి । బాలాత్రిపురసుందరి కౌమారి॥ధూ॥ శూలినుబ్బకవిచుపదయుగళా । శూలిని పాపసంహారిసద్విమలా॥ ధూ॥

## 19 దీపము.

హిందూస్తానిముఖారి - ఏకతాళము.

(హాపలాత్వం, మ్మ)

దీనపోషిణీదయాత్మ దీపహారతీ । జ్ఞానమనోదాయిని సుజ్ఞానహారతీ॥ దీ॥ కపిలఘృతసమ్మిళితవర్తిసహితమైతరగ । పాపతిమిరసూర్యతేజపావనీయికర॥ దీ॥ శంబరాసురాంతకీ కాదంబినీమణీ । అంబత్రిజగదాంబ భ్రమరాంబమణీ॥ దీ॥ స్థిరముగ బాపట్లనగరచిరనివాసినీ । వరవెంకటలక్ష్మీనారాయణావనీ॥ దీ॥

## 20 నైవేద్యము.

తోడిరాగము - రూపకతాళము.

అరగింపగావదే, మ్మ

ఆరగింపుహారునిగోడ। యధికమహానైవేద్యము॥ ఆర॥ సరసగుణశ్రీబాలాత్రిపుర । సుందరిపరమేశ్వరినే॥ డార॥ వరమాణిక్యపాత్రస్థ।మధురామృతరాజాన్నము। సారమైన యాధకసూపమును శాకసహితముగానే॥ డార॥ భక్ష్యభోజ్యలేహ్యచోష్య । పానీయములునుపంచ । భక్ష్యపరమాన్నములును ద్రాక్షేక్షురసములతోనే॥ డార॥ కండచక్కెరనుమధువును । పిండిమిరియములు పచ్చళ్లను । పిండినాటలాదివిగని । నిండుప్రేమతోడుతనే॥ డార॥ ఆజ్యముఘుదెనరయుభావ । పురవాసిలోకమాత । రాజరాజేశ్వరివెంకట । లక్ష్మీనారాయణనుత॥ ఆ॥

## 21 హస్తపాదోదకాచమనీయములు.

బేహాగ్ - ఏకతాళము.

(విష్ణుప్రియ యికనను, శైలి)

జలకలశముగొనుజగదావనఉమా। జలజదళేక్షణిజ్ఞాన స్వరూపిణి॥ జ॥ సరసతగనుకంఠ శుద్ధియొనర్పను। కరపదప్రక్షాళనమును జేయను॥ జ॥ భవబంధవిమోచనివరదాయిని। వివిధాకార శివిమలవిచారిణి॥ జ॥ బాలాత్రిపురసుందరిగౌరి। ఇలబాపట్లనివాసికౌమారి॥ జ॥ శూలిభవానీలాలితాకారిణీ। ఘూలిసుబ్బకృతివిమలసద్గ్రాహిణీ॥ జ॥

## 22 తాంబూలము.

కురంజి - జంప్యతాళము.

(స్వామికిసేవకుల, ఫణితి)

తాంబూలమదుపుల్క అంబాగైకొనుమా। కంబుకంధరిజగదాంబమొరవినుమా॥ తాం॥ పండుటాకులు మంచి పీటీవక్కలును। మెండుగజాపత్రి జాజికాయలును॥ తాం॥ ఏలకులును లవంగాలుమృగమదము। చాలగ కుంకుమపుష్ప ఘనసారం॥ తాం॥ నూతనక్తికచూర్ణమున ముడిచినవి డెముల్। ముక్తిప్రదాయిని వసుగుదరొసిప్రబల్॥ తాం॥ బాపట్లనిలయా శ్రీ త్రిపురసుందరిదేవి। పాపసంహారి ఘూలి సుబ్బారాయా వనీ॥ తాం॥

23 ఆనందనీరాజనము.

(నీరూపుజూడ, మాదిరి)

నీరాజనంబుగొనుమి నిరంజనగౌరీ। పరాత్పరీ మహేశ్వరీమునిపాపసంహారీ॥ నీ॥ వేదాంతవేదినీ పరమపతితపావనీ। నాదాంతముక్తిరూపిణీ మహావిరాగిణీ। నీ॥ పరమంత్రతపరతంత్రపరయంత్రశమనీ। పరమేశునర్ధశారీరిణీమానినీ॥ నీ॥ బాపట్లపురనిలయత్రిపురసుందరీసతీ। తాపత్రయనిర్మూలినీశుభకృతీ॥ నీ॥ ఘూలిసుబ్బరాయదాసకవితవందితా। లాలితగుణవిశేషరమ్యతనుజితా॥ నీ॥

24 మంత్రపుష్పము.

(మంత్రివర్యవినా, మాట్లు)

మంత్రపుష్పముగ మదినూహించుమా। మంత్రతంత్రయంత్రశమనిగౌరిడుమా॥ మం॥ అక్షతల్ విరుల్ - వీక్షించుమీబల్। అక్షయకరుణాకటాక్షవీక్షణియా॥ మం॥ జగస్సృష్ట్యాదికారిణీశుభాంగీ। నిగమాగమాసంచారిణీకృపాంగీ॥మం॥ ఇలభావపురీనిలయావిలాసినీ। బాలాత్రిపురసుందరిసువాసినీ॥ మం॥ మూలకారిణీమహాద్భుతచరితా। ఘూలిసుబ్బరాయకవిదాసప్రణుతా॥ మం॥

25 ప్రదక్షిణనమస్కారము.

బేహాగ్ రాగం - రూపకతాళము.

(ఏదియూ నిజమనుచునమ్మరాదు, వలె)

ప్రదక్షిణనమస్కారమిదేగొనుమపార్వతీ। వాదభేద

రహిత అద్రివరతనయశుభకృతీ॥ ప్ర॥ భక్తమనోభీష్టఫలదా యినీజననీ। ముక్తికారిణీ ప్రసన్నశక్తిరూపిణీ॥ ప్ర॥ త్రిపుర హారునిప్రియసతియో త్రిగుణాతీతా। త్రిపురసుందరీమహేశ్వరీసురవినుతా॥ ప్ర॥ ధారుణిబాపట్లనగర నిలయశంకరి। నారదాది సకలమానితశివశంకరీ॥ ప్ర॥ దారిద్ర్యధ్వంశినీమణిదయాకటాక్షిణీ। సురుచిరముగ ఘూలిసుబ్బరాయపోషిణీ॥ ప్ర॥

26 అపరాధక్షమార్పణము.

కుంతలవరాళి - ఆదితాళము.

(వనజాసన, ఘణిత)

అపరాధములన్ యణచినన్నేలుమా॥ అ॥ పాపవినాశని పరమాహ్లాదిని॥ అ॥ మంత్రములనువిని। తంత్రములను గని। యంత్రములకుజనికు తంత్రులకుజిక్కితిని॥ అ॥ వేదాంతార్ధముల్ వెదకివేసారిన। సాధుజనుల సంప్రీతియొనర్చిన॥అ॥ ధారుణిసృష్ట్యాది కారిణివీవే। ఘోరమహాఘసంహారిణివీవే॥అ॥ ఇలబాపట్లపురి। నిలయశ్రీగౌరి। బాలాత్రిపురసుందరి పరమేశ్వరి॥ అ॥ శంకరహృదయసత్పంకజభ్రమరీ। వెంకటలక్ష్మి నారాయణఘహారీ॥ అ॥

27 మంగళము.

కాంభోజిరాగం - చాప్‌తాళము.

(ఇక నేమందు నే చెలియా, మట్టు)

జయమంగాళహారాతిదే। ఓబాలా త్రిపురసుందరికౌమారీ॥ జ॥ భయపాపసంహారి భాగ్యవిద్యేశ్వరీ॥ జ॥ అజ్ఞాన

ధ్వంశినీ సుజ్ఞానదాయినీ। విజ్ఞానుమోదినీ। ప్రిజ్ఞావిశేషిణి॥జ॥ శక్తిస్వరూపిణి। భక్తసంతోషిణి। మౌక్తికధారిణి। ముక్తి ప్రదాయిని॥ జ॥ బాపట్లపురసౌధ। భవ్యవిహారిణి। త్రిపుర సంహారిణి। త్రిజగదాధారిణి॥ జ॥ వెంకటలక్ష్మీనారాయణ హృన్నిలయ। శాంకరిదాసవశంకరిగిరితనయ॥ జ॥

28 లాలి.

బిలహరిరాగం - ఆటతాళము.

(లాలికృష్ణయ్యలాలీ, మాదిరి)

లాలిశ్రీబాలాత్రిపురసుందరి లాలి। లాలికనకాద్రినిల యకాత్యాయనీలాలి॥ లా॥ సురసేవితాంఘ్రియుగళసరసిజ హిమగిరిజా। పరమార్థదాయినీవిభావసుసమతేజ॥ లా॥ నాదుబిందూకళాతీతావినోదగౌరి। వేదావేదాంతార్థవేదీజగధీ శ్వరీ॥ లా॥ కరుణాంబురాశిభక్తకామితఫలదాయి। వరనవ్య భవ్యదివ్యవరదాయిగుణదాయి॥ లా॥ శాంకరిభావపురవిహా రిణీభాగధేయ। వెంకటలక్ష్మీనారాయణహృన్నిలయ॥ లా॥

29 అవధారణ.

(పవ్వళించుమా, ఫణితి)

అవధరింపుమా। గౌరీ। అవధరింపుమా। అవధరింపు మఖిల జగదాంబసుగుణాంబవుమా॥ అ॥ భక్తిమీరదాసులు నీభజన జేయుచుండిరీ। ముక్తిదాయివనుచుమునులు పూజచే యుచుండిరీ॥ అ॥ పంచదశాక్షరిమంత్రిపావనివీవే। పంచభూ తేశ్వరిజగత్పావనివీవే॥ అ॥ సర్వసిద్ధిదాయిని జగత్సకలమో

హినీ। సర్వవిఘ్ననాశనిసౌభాగ్యదాయినీ॥ అ॥ తాపససంతోషిణీబాపట్లవాసినీ । త్రిపురసుందరీ మహేశ్వరీసువాసినీ॥ అ॥ సారససమదళలోచనిశాంకరిలలితా । వరవెంకటలక్ష్మీనారాయణప్రణుతా॥ అ॥

30 బ్యాండుస్వరము.

(స్వావమేదో, వలె)

అవధరింపుశంకరీ । అఖిలజగవశంకరీ । అవనిరిపుభయంకరీ । అద్రిసుతశుభంకరీ॥ అ॥ మానసం । జీవనీ । చేరియీ । పూజలు । కోరిగైకొనదమ్మ కామితప్రదా । సర్వభక్త । కోటివినుత । సర్వసాక్షి । భూతచరిత । క్రూరదానవహత । బాపట్లపురనిలయ । శ్రీబాలాత్రిపురసుందరీ॥ అ॥

31 పరాకు.

ముఖారిరాగము - ఆదితాళము.

(సరోజాక్షరుని, వలె)

పరాకుపరమపావనీసౌభాగ్యదాయినీ । పురారిమానసాబ్జవిహారసౌఖ్యదాయినీ॥ ప॥ మరాళమందగమని శత్రుమదవినాశని । ధరాధరేంద్రతనయ పరమధర్మరూపిణీ॥ ప॥ ఆగమాంతరూపిణీదయాంతరంగిణీ। భోగిదివితతిభూషిణీస్వభక్తపోషిణీ॥ ప॥ అంగజసంజీవనీశుభాంగిశేమణీ । మంగళమాణిక్యవీణానుమోదినీ॥ ప॥ ధారుణి బాపట్లసీమధామవాసినీ । గిరికుమారి త్రిపురసుందరీసువాసినీ॥ ప॥

### 32 హిందూస్తాని కాఫి - ఆదితాళము.

(కమలాంబా నా, మట్టు)

పరమేశ్వరీగౌరి బహుపరాకు । పరమార్థదాయిని బహుపరాకు॥ ప॥ మూర్తిత్రియాత్మికిబహుపరాకు । ఆర్తి సంఘసంహారిబహుపరాకు ॥ ప॥ కార్యకార్యకారిణిబహుపరాకు । ఆర్యసంఘసన్నుతబహుపరాకు॥ ప॥ మందస్మితానన బహుపరాకు । బృందారకాసద్వంద్యబహుపరాకు॥ ప॥ దక్షయాగవిధ్వంశిజగన్నుత । లక్ష్మినారాయణశర్మనుత॥ ప॥

### 33 హెచ్చరిక.

ఆదితాళము.

(నా యనయాముని, సూరటి)

సచ్చరీత్రిగిరిసుతహెచ్చరిక । పచ్చవిల్తుసంజీవిహెచ్చరిక॥ స॥ సనకసనందనాద్యఖిలమునోజ్వాల । ఘనవినుతాంభోరుహపదయుగళా॥ స॥ తారకమంత్రప్రకాశవిశేషిత । తారహారకేయూరవిభూషిత॥ స॥ అంగజహరునిప్రియాంగనగౌరి । భృంగివినుతజగన్మంగళకారీ॥ స॥ ధరబ్రహ్మాండంవెంకటలక్ష్మి । నారాయణసన్నుతవామాక్షీ॥ స॥

### 34 హిందుస్తాని.

(శ్రీహాటకేశ టీనాయకుడు, ఘణీత)

హెచ్చరికామంగళకరగౌరీ । మశ్చకంఠిమందరధరుసోదరి॥ హె॥ మంజులభాషదుర్మదరిపునాశా । మంజుమంజీరసచ్చరణప్రకాశా॥ హె॥ సాధులోకవశీకరణనుతపదా। నాదు

బిందు కళాతీత వినోదా॥ హే॥ కారుణ్యాంబుధి ఘన గుణ దాయి। మారుని ప్రాణసంజీవనదాయి॥ హే॥ శంకరిభక్తవశం కరిచరిత। వెంకటలక్ష్మినారాయణవినుత॥ హే॥

35 ఏకాంతసేవలు ప్రారంభము.

—♦ మేలుకొలుపులు. ♦—

మలయమారుతము - ఆదితాళము.

(ధన్యుడెవ్వడో, మాదిరి)

మేలుకోగదే। సర్వేశ్వరీ॥ మే॥ బాలాత్రిపురసుందరిప రదేవి। లీలావిగ్రహధారిజగధీశ్వరీ॥ మే॥ శుకపికనికాయము లుచెలగికూసే। ఏకమైదిశలనుకాంతిహెచ్చెగా। పంకజాప్తుడవతరించబోవుచుండె। శంకలేలభావనగరనిలయగౌరీ॥ మే॥

36 పూరి - మధ్యాది.

మేలుకొమ్మబాలాత్రిపురసుందరీ। మూలధారమునకు ముఖ్యమౌకౌమారీ॥ మే॥ తారకభావపంజరకీరగౌరి। తార హారభూషితనిర్విచారీ॥ మే॥ ద్వాదశాంతస్థానవాసిధర్మనిలయ। నాదుబిందుకళవినోద శైలతనయ॥ మే॥ జగదుదయస్థితిలయకారిణివే। నిగమాగమాంతసంచారిణివే॥ మే॥ బాపట్లపురమందు వెలసినావు। తాపసేంద్రులకుగాని తెలియరావు॥ మే॥

—♦ పవళింపుపాటలు. ♦—

37 అఠాణరాగము - ఆటతాళము.

( శ్రీ చేలంగా జాలము, మ్మ )

పవ్వళించజాగేలనెబాలాత్రిపురసుందరి॥ ప॥ ఇవ్వసు,

ధరలోగల । పుష్పాలచకరకతతులతో । జవ్వానులమర్చిన శయ్యను। పవ్వళించుపతిహారునితో॥ ప॥ బంగారపుగోలసులచె। శృంగారమైచెలువొందెటి । సుగళపత్రిదపూనుంజలి । రంగూలదిలకించుబోటి॥ ప॥ పరిమెళాదూలు ఫలహారాములుగొని మెప్పుగ । విరిపీగచిత్తర్వులునద్దములుగదియుండగ॥ ప॥ కేళికాగృహామునరతి కేళినిసేకాంతముగ। నళినాయతేక్షణిచంద్రిమాళిమనమురంజిల్లగ॥ ప॥ బాపట్లపురసౌధాంతర । భవ్యసద్విహారిగారి । శ్రీపరమేశ్వరిలక్ష్మీనారాయణఅఘసంహారి॥ ప॥

## 39 గంధంపాటలు.

బేహాగ్ - ఆదితాళము.

(తాండవనృత్యకరీ, మాదిరి)

గంధమునందగదే । కాత్యాయని॥ గం॥ బంధవిమోచని । బాలాత్రిపుర । సుందరిజ్ఞానఖనీ । కాత్యాయని॥ గం॥ పురహారుప్రియసఖి । పూర్ణచంద్రముఖీ । వరునితోవినుతసుఖి । కాత్యాయని॥ గం॥ పచ్చకర్పూరము । వరమృగమదము । హెచ్చుగుసుందరము । కాత్యాయని॥ గం॥ భావపుర్శ్వరి । భాగ్యవిద్యేశ్వరి । శివమనోవిహారి । కాత్యాయని॥ గం॥ వెంకటలక్ష్మీనా । రాయణశర్మహృ । త్పంకజసద్విహారి । కాత్యాయని॥ గం॥

## 40 కమాసు - జంపె.

(కలువలకళికించెనె, ఫణిటి)

గంధముందుకొనవెత్రిపురసుందరిపరమేశ్వరి । సంది

యములువీడియుశశాంకమౌళితోగారీ॥ గౌ॥ రహిధరేంద్రము ద్దుతనయరాజరాజశేఖరీ । అహితతివిభూషిణీఅశేషజగదధీ శ్వరీ॥ గౌ॥ మృగమదఘనసారములనుముగుదలుగొనివచ్చిరీ । అగణితముగఆగమాంతరూపిణీవనిమెచ్చిరీ॥ గౌ॥ విరివిగసురవ రులువినుతవాక్యసరణిజొనుపగ । గరిమనుకిన్నెరులుసరసగీత ములనుపాడగ॥ గౌ॥ . ధారుణిబాపట్లపురనివాసిః సువిలాసినీ వరఅభినవసోమేశ్వరహృద్వాసినీసువాసినీ॥ గౌ॥

41 విడెములందుపాటలు.

కమాసు - జల్వాతాళము.

కపుముదముసవిడెము జేయగౌరికరుణగాంచుమా । వే డుకలనియెంచుమా । విభు । గూడగనూహించుమా॥ క॥ మెచ్చగలుగుపోకలురుచినిచ్చుపండుటాకులున్ । పచ్చకర్పూ రంబును । ముచ్చటగనమర్చెను॥ క॥ వనరుగజాపత్రిజాజికా యలుయేలకులును । ఘనలవంగాలును । గరిమనునంది వ్వను॥ క॥ మౌక్తికసచ్చూర్ణములతోముగుదలుయిటుముడి చిరీ । భక్తితోనర్పించిరీ । భయహారీవనియెంచిరీ॥ క॥ అవనిని బాపట్లపురనివాసినీసువిలాసినీ । శివమనోబ్జవాసినీ । సుదతిచి ద్విలాసినీ॥ క॥ వరవెంకటలక్ష్మీనారాయణసంసేవితా । ధరా ధరేంద్రవరసుతా । దానవకులమదహృతా॥ క॥

42 కమాసు - జల్వా

(అలుకలనీకేందర, వరే)

హిమగిరివరతనయవేగవిడెము జేయనెంచుమా । విమ

లహృదయుడైననీదువిభుని సరసగాంచుమా॥ హి॥ మెచ్చగలు గుపోకలురుచి హెచ్చుబండుటాకులు । పచ్చకర్పూరంబు జేర్చి తె చ్చిరిటులవనితలు॥ హి॥ జాజికాయ లేలకులుసుజాపత్రిలవంగా లును । రాజరాజేశ్వరియివె రియమునమది జెందను॥ హి॥ భావ పురవిహారిణిసౌభాగ్యసంపద్దాయినీ । రవిచంద్రవిలోచనివర దాయినిగుణదాయినీ॥ హి॥ సురుచిరనవరత్నహారభూషణిజగ దీశ్వరీ । వరవెంకటలక్ష్మినారాయణఅఘసంహారి॥ హి॥

## 43 లాలిపాటలు.

### బ్యాగ్ రాగం - ఏకతాళము.

(ఽ గాఢీలోలా, గారిరి)

శ్రీగౌరీలాలీ । నాపాలీ । పెన్నిధిగుణశాలీ॥ శ్రీ॥ బాలా త్రిపురసుందరిదేవి । భవభయసంహారీ । గిరిసుత । భవభయ సంహారీ । భవభయసంహారీబాలా । భవనునోబ్జవిహారీ॥ శ్రీ॥ పూర్ణచంద్రముఖస్వర్ణమయాంచిత । ముంజలియిదెగనుమా । మణిమయ । ముంజలిగనుగొనుమా । ఉంజలిగనుగొనుమా । బాలా । అంజలిమదిగొనుమా॥ శ్రీ॥ గరుడులుగంధర్వులుకింపు రుషులుకిన్నరులలిబాడ । సిద్ధులు । కిన్నరులలిబాడ । కిన్నరు లలిబాడ । బాలా । విన్నపములుగూడ॥ శ్రీ॥ శ్రీబాపట్లపు రాంతరసౌధవిహారిణిరిపుహరణి । మధురస । భామణిరిపుహ రణి । భామణిరిపుహరణి । బాలా । పావసరిపుహరణి॥ శ్రీ॥

44 కీరవాణి - ఆదితాళము.

లాలిబాలాత్రిపురసుందరిలాలి। లాలిశ్రీరాజరాజేశ్వ రీలాలి॥ లా॥ ప్రణవపంజరతనివాసినిమాలిని। గణాధిపజనని త్రికూటనివాసిని॥ లా॥ విమలచిన్మయానందాదాయిని। సోమే శ్వరుప్రియనారిసువాసిని॥ లా॥ శరణాగతజనసంస్తుతచరణా। హారకటకకేయూరవిభూషణా॥ లా॥ శంకరిబాపట్లసౌధనివా సితే। వెంకటలక్ష్మీనారాయణవినుతే॥ లా॥

(45 జోజో నా ముద్దులతనయా, మాదిరి)

జోజోశ్రీబాలాత్రిపురసుందరిపరదేవి। జోజోశ్రీచక్ర వాసినీచింతామణిపీఠిని॥ జో॥ సర్వాభరణీసర్వసమ్మోహిని। సర్వాహ్లాదినిసర్వస్తంభినీ। సర్వరంజనీ। సర్వజృంభిణీ। సర్వ భక్తసౌభాగ్యదాయినీ॥ జో॥ కోటిసూర్యదివ్యతేజసమప్రభా। పాటీరకామిత్రశితఫాలభూషితా। కుటిలహాతా। సుజనహితా। హాటకవసనసహోదరిశ్రీకరి॥ జో॥ బాపట్లపురమందిరాంతర సద్విహారి। శ్రీపరమేశ్వరిసర్వసంపత్కరి। పాపహరా। భక్త నుతా। కృపాంగిస్త్రీలక్ష్మీనారాయణార్చిత॥ జో॥

46 దేశియతోడి - మధ్యాదితాళము.

(రంగ నాథపురీ, మాదిరి)

గిరిబాలాగుణశీలజోజో॥ గి॥ చారుసరోజవిలోచని జోజో। మరాళమందగమనజోజో॥ గి॥ ఓంకారిహ్రీంకారి క్లీంకారిజోజో। శాంకరిశివునారిజోజో॥ గి॥ బాపట్లవాసినీభ వహారిజోజో। అపరాధక్షమాకృతిజోజో॥ గి॥ బాలాత్రిపుర

సుందరిదేవిజోజో।లీలావిగ్రహధారిజోజో॥ ౫॥ లక్ష్మినారాయణపరిణుతాంఘ్రిజోజో । మోక్షస్వరూపిణిజోజో॥ ౬॥

47 అఠాణకళ్యాణి - మధ్యాదితాళము.

(పంచతుండవతి, వలె)

లాలీశ్రీబాలాత్రిపురసుందరీ । లాలిఫాలలోచనుప్రియునారీ॥ లా॥తారకాంతితిరస్కారినాసాభరణే । తారహారభయపాపసంహారణి॥ లా॥ శ్రుతిసంస్తుతవైభవవిప్రప్రియా । స్తుతిమతిశర్మదాసామగానప్రియా॥ లా॥ మందస్మితసుందరజలజాత । ఇందిరేశసోదరిలోకమాత॥ లా॥ పంకజాక్షిశ్రీభావపురీశ్వరీ । వెంకటలక్ష్మినారాయణనుమహారీ॥ లా॥

48 కళ్యాణమహోత్సవముపాట.

కళ్యాణిరాగం - ఆటతాళము.

కళ్యాణముజూడరే । గౌరీశ్వరుల॥ క॥ కళ్యాణప్రదులోసత్కరుణాంతరంగులు । కళ్యాణమంటపమునవేచియుండగ॥ క॥ సురగరుడోరగసిద్ధచారణవిద్యా । ధరులుగంధర్వులుకిన్నెరులొచ్చిన॥ క॥ వేదఘోషములెల్లను । పృథివీశ్వరులువిమలులైశతియించను । అధికమంత్రములచెవేదోక్తముగహోమ । విధులొనరించిరిసదమలముగమీరు॥ క॥ వారాంగనలాడగ । విప్రాంగనలుహారతులనుసీయగ । తీరుగఅభినవసోమేశ్వరుడుబాలా । త్రిపురసుందరికి మంగళసూత్రమునుగట్టె॥ క॥ ధరభావపురమందున । వారకచైత్రశుక్లపక్షమునందున । అరయగటకాదశిప్రభృతిజరుగును । వరవెంకటలక్ష్మినారాయణార్చితుల॥ క॥

## 49 అక్షతారోపణము.

కాంభోజిరాగం - ఆదితాళము.

అక్షతరోపణమిదాశ్రిం సుకన్నుల నీక్షణమునసందరు। దాక్షాయణీబాలాత్రిపురసుందరికిని। అక్షయప్రమదాసోమేశ్వరునకగు॥ అ॥ గిరినిలయుచంద్రశేఖరుపాదపద్మములు। గిరిరాజుకడిగియును। గరిమనాగిరిజనుగన్యదానముచేసె। గురుతుగమనమిపుడుకరుణాతోవారల॥ అ॥ ధారుణీబాపట్లపురమునజరుగును। తడయక వైభోగము। మరువేలనేమనము జూచివినియెరుగము। వర వెంకటలక్ష్మీనారాయణావనుల॥ అ॥

## 50 రథోత్సవము.

ముఖారిరాగము - ఆదితాళము.

రథోత్సవమిదెరమణీయముగద। రండిసుజనులారా। అధికాహ్లాదము పరమానందము। నరయుడిఇహ పరములుదరి జేరా॥ర॥ సరసతనభినవసోమేశ్వరునకు। శ్రీబాలాత్రిపురసుందరికి। పరిణయమాయెనుమనమందరమును। పరికించుదమిక యీసరికి॥ ర॥ నవవాద్యములు విమ్రోగగను। నాట్యాంగనలాడ। వివిధచిత్రవిచిత్రములెల్లను। వీథులనెంతయు నొనగూడ॥ ర॥ భూసురులందరు ఆశీస్సులనిడ పుణ్యాంగన లారతులీయను। భాసురముగ పుష్పవృష్టి గురియగను। పరగగానములుచేయా॥ ర॥ భావపురంబున చైత్రశుద్ధమున పూర్ణిమపరవడిని। అవనినిలక్ష్మీనారాయణ నుతులనునరయుడి యీతరిని॥ ర॥

—♦ తలుపుదగ్గఱ పాటలు. ♦—

51 ఖరహరప్రియ - ఏకతాళము.

(సోదా నాపీక, మట్టు)

వాకిలిదియ్యవె వాదేలగౌరీ । కోకిలవాణి నాకోర్కెను గోరీ॥ వా॥ వాకిలిదియ్యను వామదేవేశా । సాకులికేలను చాలుమహేశా॥ వా॥ ఎన్నడులేని యీవింతాలదేల । కన్నెరో యీతెరి కఠినము మేల॥ వా॥ సోయగ మేలనిచోద్యములాడెను। రయమున నీవర్ధరాత్రినిబోయెను॥ వా॥ భక్తులు ప్రార్థించ బాలించనేగతి । యుక్తమనుచు నికయూహించియుసతి॥ వా॥ అర్థులపాలించ యర్ధరాత్రిమున । సార్థకమనగ యీయర్థమదాన॥ వా॥ కాలామనర్థముగాని వకభాగా । చాలగ శ్రీత్రిపురసుందరివేగ॥ వా॥ పొంకముగా భావపురధామచరిత । వెంకట లక్ష్మీనారాయణ వినుత॥ వాకిలిదీసితి వరమూర్తిరారా॥

52 ముఖారిరాగము - ఆదితాళము.

(కాలుక సోభిమణా, మాదిరి.)

వాకిలిదియ్యగదే వాదేలనె శంకరి॥ వా॥ కోకిలవాణి నిన్ గోరివచ్చితిసతి । సాకులదేలనతి । సరసీరుహనేత్రి॥ వా॥ వాకిలిదియ్యను పో । వరగుణశంకర॥ వా॥ ప్రకటముగ నా ప్రాపు నీకేలా । శ్రీకర శర్వభవ । సోమేశ్వరదేవా॥ వా॥ రాక నిరాకరణంబిదిమేలా । లోకతో బోధ్యమిలా । జగదీశ్వరిశీలా॥ వా॥ ఘనముగ నీనిశికాలమునందున చనిమొటి నీవెవరో । సత్వరమున దెలుపుము॥ వా॥ కామదమనుడని

కాంతరో దెలియుము । ప్రేమతో నిటువినుము । ప్రేయసిద యగనుము॥ వా॥ కామదమునకు కామినులంమన । మమత లుఘూడెవన । మహిమెచ్చునన్యాయము॥ వా॥ చిక్కులదేలని చక్కెరవిల్తుకు । జిక్కితి తాళనునే । నెక్కరణివిజయము॥ వా॥ ధారుణి బాపట్ల । ధామునికీశ్వర । పురహరనుతివినుత । పర మేశ్వరచరిత॥ వాకిలిదీసితిరా । నరభూషాలంకృత॥

53 హిందుస్తానితోడి - జుల్వాతాళము.

(ఎంతకతన మావసే; ఫణితి)

తలుపుదియ్యవేసతి । అలరు విల్తుబాధలకు । అలసి సొలసి పిలిచితిని నేనలసి సొలసి పిలిచితిని॥ త॥ తలుపుదియ్య సోపార । తలచి వలచి పిలచియున్న తలరుబోశినరయుపొమ్ము। ఆతలరుబోశి నరయుపొమ్ము॥ త॥ కామినియే కోమలిని నా మదిలో గోరితిని । సామగానలోల శీల । శ్రీనుల జెందజేయ నేల॥ త॥ సోమశేఖరదేవ నీనుశిరమున నొకసతినిదాల్చి । నీ మముగా బల్కెదవు । నీలకంఠచాలుజాలు॥ త॥ మందాకినినైనట్టి దీని । మహిమను వర్ణింపవశమె । బృందారకుల ప్రార్థనలచె । వందితి నళినాయతాక్షి॥ త॥ దేవముమలసంకల్పము। ధీమతివై దీర్చినట్టి భవభవాబ్ధితరణ నీవు । భావమింత భ్రమ లదేల॥ త॥ ధారుణి బాపట్ల నిలయ । ధరాధరేంద్రముద్దు తనయ । సరస శ్రీబాలాత్రిపుర । సుందరి నన్నేలు వినయ త॥ అభినవ సోమేశ్వర నే । అంజలి నొనరింతు చాల । శుభ మ్ములనలరార వేగ । సురుచిరముగరార భాగా॥ తలుపుదీసితీ

రారా । తావకపదయుగళిగొల్తు॥ త॥

### 54 బ్యాండుస్వరము.

(శ్రీ రామచంద్రులకు శైలి)

తడవేల శంకరి । దాసావశంకరి । గడివేయగా ఘనమా । నా । నా । చేడలిటు లెవరుంచురే॥ త॥ తగవేల శంకర । యోగీవశంకర । దగ తలుపుదియ్యను పో । పో । పో। భోగిభూషణ న్యాయమే॥ త॥ వాదంబులేలను । వదరూటలేలను । సాధు జనావని చాల్ । చాల్ । చాల్ । భేదమును మదినెంచియు॥ త॥ సత్యంబుదప్పిన । గత్యంతరముగన । వత్యంతమోదం । బా । నా । నా । నిత్యంబిదే విధే॥ త॥ ఆహాహానిక్కువ । సాహసమెంతువ । అహరహమీ విధ । ము । య్యా । రే । ఊహాగన వదియేలనే॥ తగ॥ అహిరాజభూషణ। గ్రిహాబలముగ ననా । గ్రిహామింపుజూపిన । మే । లా । నా। సహానమందిన జాలదే॥ తగ॥ ఎన్నన్నొవిధముల । కన్నరొనన్నిల । మన్ననల్ చేయ మేల్ । మేల్ । మేల్ । సన్నుతించెద గాంచవే॥ తడ॥ నిరతంబు బాపట్ల । పురనిలయ నీవిట్లు । మురిపెంబులాడివ । ము । ఖ్యా । బా । ద్వారమును దీసితినీ॥ నిర॥

### 55 జంఝూటి - ఆటతాళము.

(మహారాజదర్శనతరుణములా, మట్టు)

తడవేల గిరిసుత తలుపు దియవే తరుణి యిదివినవే । తగుమాటలచె లాలించవే । తమకంబు హెచ్చెను గాంచవే।

త॥ మోమాటమేలను తలుపు దియ్యను మోహనాకారా। ముని హృదయ సంచారా। మదన మదసంహార॥ మో॥ మధిరాక్షి మనకిది మదన కదనము కదనుగద వినవే। వృధమాటలను చాలించవే। మధురాధరము నొసంగవే॥ త॥ మసి బూసి నేరేడులను జేసిటి న్యాయకాడని నెంచితీ। మటుమాయకాడని గాంచితీ। మర్యాదగాదని చెప్పితీ॥ మో॥ ఇదివరకు ఎన్నడులేని వింతలుగలిగె నిపుడే మే। మదవతిరో యిది ఘనమే। పదుగురరయుట భావ్యమే॥ త॥ అర్ధరాత్రినినేగనగు సందర్భములు వివరింపుమా। వ్యర్థంబుగాదిది తెల్పుమా। సార్థకము నూహించుమా॥ మో॥ భక్తాగ్రగణ్యుల ప్రార్థనలు విని బ్రోవనేగితినే। యుక్తంబు నెంచితినే। యుక్తిగాదని యుంటినే॥ త॥ ఆర్తులను పాలింప వేళావేళలరసిన గూడవ। వార్తలివియని నెంతువా। కర్తవ్యమును వినుపింతువా॥ మో॥ రక్షణకు సమయంబులరయుట రహినిగూడున న్యాయమా। తక్షణము మొర నెంచుమా। యీక్షణమున నన్నేలుమా॥ త॥ బాపట్లపురవరధామసోమేశ్వరవర ప్రదాయకా। పాపభయ సంహారకా। తాపస మనోనాయకా॥ తడవేల రమ్మిక తల్పు దీసితి తక్షణము దేవా॥

56 బ్యాండుస్వరము.

తలుపూ దియ్యవే। పిలచిన బలుకవు అలుకలు నిలపియు॥ త॥ బాలాత్రిపురసుందరి నీవు। చాలాగనాగ్రహమొందెదవు। కలహామున। ఘనతగున। చులకన నా। వలతగున॥

త॥ తలుపూదియ్యను । తలచిన వసితలతావుకు బొమ్మిక॥ త॥ ఫాలాక్షు నిన్నెవరు ప్రార్థించిరీ । బాలేందు మౌళివరు పిలిపించిరీ । కలతలు మా । నుము ననుమా । నమువిడి మా । య లవిడ మా॥ త॥ సరిసరి యివి నేటిచోద్యంబులే । గరిమను యివి నీకు గ్రాహ్యంబులే । మురిపెము నా । వలవిడినా । త్వరితము నా । కెనయగునా॥ త॥ కట్టిపెట్టుము నీవిచిత్రంబులు । నట్టడవిలోద్రోయు చరితంబులు । ఇట్టివి నీ । కెట్టుల నీ । పట్టితి నీ । పట్టవినీ॥ త॥ ఎన్నడు లేని యీవిన్నదనంబే । మన్నను వినుపించవే మాటంబే । సన్నుతులగ । మన్ననలగ । గొన్ననిలగ । గ్రిన్ననలగ॥ త॥ గాపట్ల పురనిలయ సోమేశ్వర। శ్రీ పరమేశ్వర చిదంబర । పాపహార । దాసభర । ప్రాపివరా । ప్రణమిదెర॥ తలుపూదీసితీ । తనువును విరపాన్పున దగ జేర్చుము॥ త॥

57 శంకరాభరణము - జల్వాతాళము.

(మేరెజోబన, మట్టు)

తల్పుదియ్యవదేలనె తరుణేందుశేఖరి తాళజాలనే । తాళజాలనే॥ త॥ తల్పుదియ్యను పొమ్మిక తగవులదేలను । తామసించక । తామసించక । తామసించక॥ త॥ వాదములాడియు భేదముజేయుట యిదిమంచిసమయమటే । సాధుపోషిణీ! సరసజేరితీ । మోదమూరగా । మోముజూపవే॥ త॥ గంగాధరూడవని నిన్ను లోకముప్రాంగిలాని యాడగను । రంగూగ యీప్రసంగములేల। సంగతిజాలు యీసరసకు రాకుము॥ త॥

లోకులు పలుగాకులై దూరునట్టి యావాక్యములాలింతురా । జోకశోడను । నాకథను విను । పాకటముగా । ప్రార్థనజేతును॥ త॥ కల్యాణ కథ లెన్నియైనను కల్పించు కథకుడవౌనువీవు । తల్పమున కీ । తావుగాదిక । అల్పదానవర । నరయగూడదు॥ త॥ ఎన్నడు పలుక నీచిన్నమాటలచె చిన్నతనమును జేయకే । చిన్నారి పొన్నారి । మన్ననలశోడి నన్నేలుము సన్నుతాంగి॥ త॥ బాపట్ల పురనిలయ సోమేశ్వరనగుబాట్లు నను వాదంబుచే । అపరాధమును । ఆణచిపుచ్చుము । పాపుగోరితి । ఓపరాత్పరా॥ తల్పుదీసితి రమ్మిక తడవేలనో ప్రాణనాయక శుభదాయక॥

58 కల్యాణిరాగం - ఆటతాళము.

(ం ములుఁలఁటవ నారికి, మాఁద)

గౌరికవాటము దియ్యుమా । నినుకోరివచ్చినవాడ గాంచుమా । తరుణేందు శేఖరి యోయుమా । సీ। తామాసము సు పీడజేయుమా॥ గౌ॥ అర్థరాత్రిని బిలచుటేలను । యిక । సార్థకము నీడజాలును । నిర్దయమొనగూడదే నింతను । ని । రర్థకపుమాట లేలను॥ అ॥ వేటాడివచ్చినవాడను । నీవు । మాటిని దప్పుట లేలను । బోటినో బూటకమేలను । ఆ । నాటిమాటలు మరువ నేలనూ॥ గౌ॥ ఫాలాక్షు యీమాటచాలును । ఆ । లోలాక్షి లాలింపబోలును । లీలాల దేలింపపోలను । యీ । జాలాము నోపకతూలును॥ అ॥ తామాసమేలనె శంకరి। వర।

తాపసలోకవ శంకరి । వామాక్షి శతృభయంకరి । కినుక । వదలుమ సర్వశుభంకరి॥ గా॥ మాయాలుచేయుటన్యాయమా। బల్ । మాయురె యిది నీకుభావ్యమా । కాయము శ్రీమ జెందెగాంచుమా । శివ । వేయేల నీకిది శ్రేయమా॥ అ॥ చిన్నమాటల నాడనేటికి । నీ । చిత్తముజూపవదేటికి । సన్నుతి జేతు నీపాటికి । కను । సన్నలబ్రోవుమీ నాటికి॥ గా॥ బాపట్లవాస సోమేశ్వర । భవ । బంధవిమోచవ యీశ్వర । త్రిపుర సంహార సర్వేశ్వర । ఇక । కృపయుంచిరమ్ముగిరీశ్వర॥

59 బ్యాగ్ రాగము - ఆదితాళము.

తలుపుదియ్యవె శంకరి । చలమేల నింక భక్తలోకవ శంకరి । వలపు నిలుపగలేను । కలతేలనికను । జలజాక్షినను దయను । గని బ్రోవగాను॥ త॥ తలుపుదియ్యను శంకర । పలుకరించకపొమ్మదనుజ లోకభయంకర । ఇలనీకుతగున యీమిడిమేలమిటులా। కులుకునిలుపుము నావల । కరుగుమిక చాల॥ త॥ ఆహా ఎన్నడులేని । సాహసమిటుల । నూహించగతమే మిలి।నుడువుమిబాల॥ త॥ మంగాళాకార శ్రీగంగనుగూడుచు। రంగూగ నిటువచ్చెదే । సంగతిచాలు॥ త॥ తూలనాడగజాల వేల యీవేళా । బాలా యీరీతిదేల । నెనరుంచిచాల॥ త॥ భామినియాడిన బాసాలుమరచి । సోమశేఖర సుందర । తామసముగనక॥ తలుపుదీసితిశంకర । తడవేల నింకదయ యుంచి నన్నేలర॥ త॥

60 జంఝూటిరాగము - ఏకతాళము.

(చెంగ్లాటలాడెచెలీ, మట్టు)

వాకీలిదియ వేలనే। గౌరీ । కౌరీ । శౌరీ । వేడితి॥ వా॥ వాకీలిదియపొమ్మికను । ఔరా । మేరా । ధీరా । శంకర॥వా॥ మరుమాటలేలను । మరుకేళిదేలను । మారిపెమునుగనవచ్చితి । సతీ । సుధీ । మతీ । యీరీతి॥ వా॥ మరుగర్వహరునకు। మగువాలపైసింక । మరులేలవనగుండెర । ఏరా । పోరా । శూరా । గేసర॥ వా॥ మధిరాక్షియిదియేల । మధురాధరముగోల । మదితత్తరముజెందెనే । జాలా । మేలా । శీలా। యీవేళ॥ వా॥ మరుతూమనొకపక్క । మానిసినొకపక్క । శిరమూనదాల్చితివి । చాలు । జాలు । ఏలు । యీమేలు॥ వా॥ ఘనమూగనివిమెపుడు । మరినాకుసహజములు। మనమందుకలతేలనే । మగువా । తగవా । నగవా । నీవగువ॥ వా॥ మరుపుకలుగుటది । మానినిపనియౌను । ధీరులకిది చెల్లునా । దీనా । వనా గానా । లోలుడ॥ వా॥ మరుజనకు సోదరి । మహిత్రిపురసుందరి । మరువంబుయిదెగాంచుమా । లేమా । ఉమా । కోమా । లాంగిరో॥ వా॥ ధారుణిశాపట్ల । మందిరసద్విహార । దరిజేర్చిలాలించరా । రారా । ధీరా । శూరా । శంకర ॥ దరిజేర్చిలాలించరా॥

కీర్తనలు.

61 ఖరహరప్రియ - ఏకతాళము.

స్మరియించెదగౌరీ । సోమశేఖరునారీ॥స్మ॥ నిరతము

నీపాద । నీరేజములగొల్తు । నిరపాయినీనన్ను । నిరసించకను బ్రోవు॥ స్మ॥ కరమరుదుగనన్ను । కరుణతో నేలుము । కరుణాంబురాశినీ । కరుణీనిగాంచుము॥ స్మ॥ పరమమునీశ్వరీ । పరమదయాకరీ । పరాకుశేయకు । పరాత్పరికౌమారి॥ స్మ॥ ఆగమరూపిణి । అఖిలార్థదాయిని । అగజాతమాలిని । అమితాహ్లాదిని॥ స్మ॥ భావపురీశ్వరి । భాగ్యవిద్యేశ్వరి । భవహరి సర్వేశ్వరి । భావనాగమ్యేశ్వరి॥ స్మ॥

## 62 శంకరాభరణము - ఏకతాళము.

(దారదిలాగ, కూదిరి)

బ్రోవవదేల । భూధరబాల । ప్రార్థించెదనినుచాలా ॥ బ్రో॥ తవపదయుగళము దవిలిగొలచెదను । అవిరళముగ దయ । నతిశయముగభయ । హరణభయమిడి కరయుముయిటులన॥ బ్రో॥ జగదుదదయస్థితిలయకారిణిజనని । యోగులు పొగడగ । యోగములరయగ । బాగుగనీపద భజనలు జేతున॥ బ్రో॥ భవభయహారిభవబాంధములణచియు । అవనిని నేలుము । భావపురాంతర । భవ్యవిహారిణిత్రిపురసుందరీ॥ బ్రో॥

## 63 హిందుస్తాని - ఏకతాళము.

(నఘుమా పాముప, పరె)

రాజరాజేశ్వరీ । రజితశైలేశ్వరీ । పూజాగైకొనిబ్రోవు పరమేశ్వరీ । త్రిభువనేశ్వరీ । వరత్రిపురసుందరీ ॥ రా॥ కోరిప్రార్థించితిశౌరిసహోదరి । నారీయోగ్శ్రీభావనగరేశ్వరీ ।

గౌరీ । కౌమారి । నయచారి । భయహారి । త్రిభువనేశ్వరి । వరత్రిపురసుందరీ॥ రా॥

### 64 హిందుస్తాని కాఫీ - ఆటతాళము.

(నమిలాంశ్రిగణ, మాదిరి)

శ్రీరాజరాజేశ్వరిజగధీశ్వరి । శ్రీమద్మహానాయికా । బ్రోవారావ॥ శ్రీ॥ తారకాంతితిరస్కారినాసాభరణి । తారక నామాంచితా । బ్రోవరావ॥ శ్రీ॥ కనకాద్రివాసినీ కామ సంజీవని । దానవసంహారిణి । బ్రోవరావ॥ శ్రీ॥ మందస్మితా ననమంజులభాషణ । ఇందుకళాభరణా । బ్రోవరావ ॥ శ్రీ ॥ బాపట్లపురదివ్యభవ్యవిహారిణి । తాపసనంతోషిణి । బ్రోవ రావ॥ శ్రీ॥ బ్రహ్మాండం వెంకటలక్ష్మీనారాయణ । ప్రణుతాం ఘ్రిజలజద్వయీ । బ్రోవరావ॥ శ్రీ॥

### 65 హైమవతీరాగం - ఆదితాళము.

(నుంచిసముఖముగా, మాదిరి)

నాదుమనవినుమా । నగరాజసుతే॥ నా ॥ ఆదికారిణీ వేగాబ్రోవ॥ నా॥ సాధుహృదయవరసరసిజషట్పద । సదమ లచరితాసదాశివా । వేదవేద్యభావనగరవాసినీ। సుదతిత్రిపు రసుందరీమహేశ్వరీ॥ నా॥

### 66 జంఝూటి - ఏకతాళము.

(వారిజాక్షివినుమా, వలె)

బ్రోవజాలమేలా । నారీ । గౌరీ ॥ బ్రో ॥ భవరోగ వైద్య । సర్వవేదవేద్య । భవానిసాధుహృద్య॥ బ్రో ॥

పరమార్ధదాయినీ । పరశంభుమోహినీ । వరదాయిశుభగుణ దాయిని॥ బో॥ సత్యవాక్పూరిణి । నిత్యానపాయిని । అత్యధి కారిణిమానిని॥ బో॥ బాపట్లవాసినీ । త్రిపురసంహారిణి ॥ తాపసమానసవాసినీ॥ బో॥ వెంకటలక్ష్మీనారాయణవందితా సంకటభంగలోకమాత॥ బో॥

67 రామప్రియరాగం - రూపకతాళము.

కోరినవరమొసగిబ్రోవ కోపమహిమశైలబాల ॥కో॥ సారసనుదళలోచని । సాంబ్రాజ్యదాయిగాద॥ కో ॥ మన సిజసంజీవనౌషధిసుధీమణీజగదాంబ । మనమునుగనిమనుప మనుపదేలమహావిద్యేశ్వరి॥ కో॥ జ్ఞానదాయివేగదసుజ్ఞానమొ సగికరుణింపుమి । వనజభవేంద్రాదినుత । వనుహాసయినజగ న్నుత ॥ కో ॥ భావపురనివాస బాలాత్రిపురసుందరీసుశీల । అవనివెంకటలక్ష్మీనారాయణాఖ్యశర్మపాల॥ కో॥

68 కుంతలవరాళి - ఏకతాళము.

కాపుమశివశంకరి।గిరిబాలమునివశంకరి॥ కా॥పావనిశుభ దాయినిఅనపాయినివరదాయిని॥ కా॥అంబజగదాంబభ్రమరాం బసుగుణాంబవర।కంబుకంధరిమానినీ। కాదంబనవనవాసినీ॥ కా॥ మాతజగన్మాతభక్తోపేతకీర్తిప్రఖ్యాతా । నతభక్తజనవినోద । అలివేణిశైలజాత ॥ కా ॥ నారీసుకుమారీఅఘహారి భయహారి నయ । చారిత్రిపురసుందరీ । భావపురినివేశ్వరీ॥ కా॥

69 కల్యాణి - రూపకము.

దేవీశ్వేతాద్రితనయ । దేవగణసమూహానికర ॥ పావ

నిష్ఠితాంఘ్రియుగళ । భావరాగతాళమోదినీ॥ దే॥ ఘనతర శుభగుణశాలిని । గంధర్వామృతపాలిని । మనసిజజనకసహోదరి । మధురసవచనవినోదిని॥ దే॥ శాంభవిత్రిభువనసుందరి । శంభునివరప్రియనారి । అంబుజాక్షీవరమణిమయ । హారవిభూషితగాత్రీ॥ దే॥ భావపురనివాసినిముని । భావభవ్యవిహారభ్రమరీ । సేవితాంఘ్రియుగళజలజ । శాత్రవదుర్మదసంహారి॥ దే॥ వెంకటలక్ష్మీనారా । యణహృదయాబ్జనివాసిని । శాంకరిసర్వవశంకరి । సంకటఅఘసంహారిణి॥ దే॥

70 (రామనీపరిదైన, వలె)

జ్ఞానప్రసూనాంబ బ్రోవుమా । జగదుదయకారిణి గావుమా । దీనునిప్రార్థనాలించుమా । దీనచింతామణిశ్రీయుమా॥ జ్ఞా॥ చతుర్వేదప్రకాశినీ । సకలవిశ్వవ్యాపినీ । మాతృకార్ణశరీరిణి । మహాద్భుతవిరాగిణీ॥ జ్ఞా॥ భావరాగతాళమోదినీ । భక్తాభీష్టప్రదాయినీ । భవహృదయాబ్జవిహారిణి। భావపురచిరనివాసిని॥ జ్ఞా॥

71 భైరవిరాగము - ఆదితాళము.

(మొరవిని, మాదిరి)

మొరవినిబ్రోవరావ । మరుపేలసదాశివా । పురహరురాణీభవ । హరివినుతిగాంచలేవ॥ మొ॥ పుండరీకలోచన । ఖండితజనావనే । కుండలీంద్రభూషణ।ఛండిసుందరానన॥ మొ॥ కామితార్థదాయినీ । కామసంజీవని । సోమకళాధారిణి । విమలవిచారిణి॥ మొ॥ శక్తిస్వరూపిణి । మాత్రికధారిణి ।

ముక్తిదాయినీ భక్తసంతోషిణీ॥ మో॥ బాపట్లవాసినీ భవ్యవిలాసినీ। తాపసపోషిణీ। దైత్యవినాశనీ॥ మో॥

72 ఏకతాళము.

(ఏమందుయీసుందరీ, మట్టు)

దేవీమహేశ్వరీజగదీశ్వరీ। భావాముగనిత్రిపురపరమేశ్వరీ॥ దే॥ రాజరాజేశ్వరీసర్వేశ్వరీ। రాజీవదళనయనయోగీశ్వరీ॥ దే॥ కాదంబవనవాసికామేశ్వరీ। వేదాంతవేదీనిసిద్ధేశ్వరీ॥ దే॥ క్షేత్రస్వరూపిణీక్షేమేశ్వరీ। శ్రీత్రిపురసుందరి సోమేశ్వరీ॥ దే॥

73 హిందుస్తానితోడి - ఆదితాళము.

(రారారారారమణీయముగ, వలె)

సర్వాతీతా హిమగిరి వరసుత శరణుజేసి స్మరియించెద। నిన॥ స॥ సర్వేశ్వరి సకల। యోగీశ్వరి। శర్వాణిసర్వసాభాగ్యేశ్వరీశ్వరీ॥ స॥ క్రూరమైన। ఘోర। పాపమును। దురితంబులెడబాపివరిజేస్తుజగదాంబ॥ స॥ సోమేశ్వరి। కామ। కామేశ్వరి। శ్రీమన్మహానగరచింతామణిస్థలీ॥ స॥ అపరాధముల। విడిచి। కృపజూపగదె। బాపట్లపురనిలయ త్రిపురసుందరిదేవి॥ స॥

74 కమాచిరాగము - ఖం - అటతాళము.

(తడతెలసుకోవ, మాదిరి)

నినువినజగతిలోననుబ్రోచెదెవరమ్మ। అనుదినమును నాదుఫిన్నుతలుగొనవమ్మ॥ ని॥ మరుఫేలనేనునీమరుగుజొచ్చిన

గనవు । పరమదయాకరివై బరగుచున్నావు॥ ని॥ దీనునిశ్రమ లనుదిలకించగా లేవు । దీనచింతామణివని పేరువడినావు॥ ని॥ భక్తునిపాపంబు బారదోలగలేవు । భక్తమనోభీష్టఫలదాయివై నావు॥ ని॥ బాపట్లపురమందు వెలసినిలచితివీవు । త్రిపురసుందరివనుచుపొగడొందినావు॥ ని॥ సాక్షిస్వరూపిణి మోక్షదాయి వినీవు । లక్ష్మీనారాయణసేవలుగొనినావు॥ ని॥

75 శ్లో॥ - ఆదితాళము.

(దయాజూడురాను, ఫణితి)

గిరిరాజబాల । వరమివ్వవేల॥ గి॥ దురితావినాశని । దుర్మదాంధమర్దనీ । దారిద్ర్యధ్వంశినీ । దరిజేర్చుమానినీ॥ గి॥ సర్వమంత్రరూపిణీ । సర్వభక్తపోషిణీ । సర్వముక్తికారిణీ । సర్వావిద్రావణీ॥ గి॥ కామకామేశ్వరి । కనకగిరీశ్వరీ । కామితఫలదేశ్వరీ । కనకదుర్గేశ్వరీ॥ గి॥ భావపురీశ్వరీ । భయపాపసంహారి । శివహృదయసంచారి । సుబ్బవినుతకౌమారి॥ గి॥

(శ్రీరమావరా, మోస్తరు)

బ్రోవుమాయుమా। భక్తవందారుమందారమా॥ బ్రో॥ అవనిధరావరప్రియసుత । అఖలజగజ్జననినుతా । లెవఏదనే । వలనునే । విమనకపా । క్షించెదను॥ బ్రో॥ ప్రకటత్రిమూర్త్యాత్మకినయచారి । భక్తాపాయనివారణగారీ । అకళం । కవునా । అఘముల్ । త్రోసిన్॥ బ్రో॥ బాలాత్రిపురసుందరిజగదావని । యిలబాపట్లనివాసినిజననీ । ఘూలి । సుబ్బా । రాయూ । వినుతా॥ బ్రో॥

### 77 జుల్వతాళము.

(అందమగుస్కందపురమిదె ఫణితి)

వందనంబునందుమాయిదే । ఓసుందరాంగీ॥ వం॥ గంధశింధురగమనబాలా । త్రిపురసుందరీసుశీల । కుందరదనయిందుశేఖరీ । ఓసుందరాంగీ॥ వం॥ పద్మనయిననుతపదా । పద్మరాగసమప్రభా । పద్మనాభునిసహోదరీ । ఓసుందరాంగీ॥ వం॥ ధారుణిబాపట్లనగర । ధామఆగమాంతచర । ఘూలిసుబ్బరాయవందితా । ఓసుందరాంగి॥ వం॥

### 78 ఏకతాళము.

(దీనచోబహారకా, వలె)

బ్రోవరావేలవేగమేమరుపేలబాలత్రిపురసుందరీ॥బ్రో॥ సుం॥ ॥ సుం॥ సుం॥ సుం॥ బ్రో॥ సేవాలుజేయగనేజేరితీ । తవపదములేదిక్కుయనినమ్మితీ । కోరితీ । వేడితీ । జేరితీ । నమ్మితీ॥ బ్రో॥ భవపాశమునుద్రుంపనికజాలమా । భవప్రాదయవాసీనినునేలుమా । నేరమా । భారమా । జాలమా । నేలుమా॥ బ్రో॥ దాసురాలదయతోడబ్రోవలేదా । గాసీలబెట్టగఘనమైనదా । నీపదా । మేసదా । నెన్నెదా । సర్వదా॥ బ్రో॥ బాపట్లపురమందువెలసుంటివీ । తాపసులపోషింపదగియుంటివీ । నామొర । వింటివీ । కరుణను । గంటివీ॥ బ్రో॥

### 79 కాంభోజరాగం - చాపుతాళము.

నీవేతల్లివిదండ్రివీవేగురుదైవమై । సావధానమతితో।

పాక వేమిక గౌరీ ॥ నీ॥ ముల్లోకములలోనీ వేలువారెల్లనీ । తల్లిదండ్రులవంక వారే మొదెల్పుమా॥ నీ॥ రక్షింపనీకన్న రక్షకు లెవరమ్మ । శిక్షింపనీకన్న శ్రేష్టులింకెవరమ్మ॥ నీ॥ శాంతించి భక్తులే కానుకలిచ్చిరో । పక్షపాతము బూని పరికించకున్నావో॥ నీ॥ కన్నబిడ్డలనెల్ల నొకకంటజూడుమా । కన్నడశేయక విన్నపమును వినుమా॥ నీ॥ బాపట్లపురనిలయ త్రిపురసుందరిదేవి । కృపజూడుమిక ఘూలిసుబ్బనుత కౌమారి॥ నీ॥

8. (కగణము గాంచుము, మట్టు)

దయగనిబ్రోవుము దాక్షాయణీ॥ ద॥ భయసంహారిణి । భక్తసంతోషిణి । తోయజలోచని । ధర్మసంవర్ధనీ॥ ద॥ భక్తాపాయనివారణచరణ । యుక్తజనాభీష్టఫలదాయ్రిమ॥ ద॥ మందస్మితవదనారవిలాసి। బృందారకాదిసద్వంద్యపరికాశీ॥ ద॥ శ్రీమన్నగరనాయిక సర్వేశ్వరీ । శ్రీమద్బాలా త్రిపురసుందరీ॥ ద॥

81 బ్యాగ్ - ఏకతాళము.

బాలాత్రిపురసుందరిపరదేవి । బ్రోవసమయమిదె । భక్తవినుతపదే । శూలపాణిసఖి । బాలచంద్రముఖి । కరుణన్ । గనుచున్ । నుతులన్ । వినుచున్॥ బా॥ సురసేవిత సత్పదపారసయ్యుగ । కరుణారసభరణాజగదావన । సారస లోచని । సన్మునిపాలిని । నూరిజనావని । సరసవినోదిని । గరిమన్ । బ్రోవన్ । సరగన్ । జనగన్ శ్రీ॥ బా॥ ధర బాపట్లనివాసినిమాలిని । వరలక్ష్మీనారాయణపోషిణి । మారసం

జీవనీ। మానినిశూలిని। కార్యాకారిణి। ఆర్యజనావని।
నిరం। తరం। దయన్। గనన్॥ బా॥

82 (త్రిపుచేయు, మాదిరి)

త్రిపురసుందరిదేవి। త్రిమూర్త్యాత్మకి॥ త్రి॥ పాపవి
నాశని। పంకజలోచని। తాపత్రియనిర్మూలినిమాలిని॥ త్రి॥
చతుష్షష్ట్యుపచారాధ్యాయి। చతుష్షష్టికలామయివరదాయి।
చతుర్భావభూషితగుణదాయి। చతురవచన దరహాసిని
మాయి॥ త్రి॥ సర్వభూతహితకారణిఅంబ। సర్వాభరణభూ
షితజగదాంబ। సర్వమయీజ్ఞానప్రసూనాంబ। ఉర్వినిభావ
పురీనిలయాంబ॥ త్రి॥

83. (రామానీసరిదైవము, మాదరి)

బాలాత్రిపురసుందరి దయగనుమా। ఫాలనయన మ
నోహ్లాదినిశ్రీయుమా॥ బా॥ అళికులవేణి। అంబుజపాణి।
జలజదళేక్షణి। జగదుపకారిణి॥ బా॥ నారదాదిమునినతజన
ఫలదా। క్రూరదైత్యమనోగర్వ వినాశితా॥ బా॥ సురగణ
పూజితసురచిరపాదా। దురితహరణపరదుర్మదభేదా॥ బా॥
ధారుణిబాపట్లధామసర్వేశ్వరి। వరఘాలిసుబ్బరాయాఖ్య
హృద్గోచరి॥ బా॥

84 ఖరహరప్రియ - ఏకతాళము

(పోదాం వా సీత. శైలి)

సుందరిబ్రోవుమశ్రీబాలాత్రిపుర॥ సుం॥ మందగమన
అఖిలాగమాంతచర॥ సు॥ శ్రీమన్ మహానగరసింహాసనా

స్థిత । అమరవినుతపంచబ్రహ్మాసనాస్థిత॥ సు॥ ఆదిగర్భేశ్వరి అఖిలధరేశ్వరి । సాధుజనేశ్వరి సకలమునీశ్వరి॥ సు॥ షోడశోపచారమితాహ్లాదిని । షోడశగౌరిసన్మోళితసుజ్ఞానివి॥ సు॥ వాసిగబాపట్లవాసనద్విహారి । శాశ్వతైశ్వర్య సుబ్బార్చిత గౌరి॥ సు॥

85. (పారసదళలోచని, ఫణితి)

పావనివరదాయినిగుణదాయిని అనపాయినీ । భువన మోహినీ । పాపవినాశని । భక్తమహాద్భుతఫలదాయినీజననీ॥ పా॥ సౌభాగ్యదాయినిసజ్జనధ్యేయని । ఇభరాజగమనిసద్విను తవిశ్వాసినీ॥ పా॥ వేదాంతవేదినీ । సాధుజనావని । నాదాంతముక్తిస్వరూపిణిధీమణి॥ పా॥ బాపట్లపురదివ్యభవ్యవిహారిణి । త్రిపురసుందరిదేవి । త్రిజగదావని॥ పా॥

86. హిందుస్తానితోడి - చాపుతాళము.

(ఏరీవాహ్వారీ, మట్టు)

ఏరీసీసరిదైవములారేకుజగములనేగాన పరమేశ్వరి । పరమంత్రపరతంత్రపరయంత్రశమని । పరమేశునర్థశారీరిణి మానిని॥ పరమేశునర్థశారీరిణిమానిని॥ ఏ॥ మహిషాదిదానవ మదభంజనిజగన్మోహినివరదాయిని । అహితతతివిభూషణభూషితశ్రీజగజ్జనభయపాపసంహారిణీ । మహామాయాఅనపాయినీ । మహారూపాగుణదాయినీ । మహాచక్రనగరసామ్రాజ్యసద్విద్య। బహుబలాఢ్యగణవశంకరివాసిని॥ ఏ॥ ఉదయించుటను బెంచుటను ద్రుంచుటకు జూడదగియుండదని వేగదా । వేదరహస్యా

ర్ధ వేదీవిసుజనానుమోదీవినీ వేగదా । ఆదికారిణివీ వేగదా । సాధుపోషిణివీ వేగదా । మధిరాక్షి బాపట్లమందిరసద్విహారి । కాదంబినీత్రిపురసుందరి పరదేవి॥ ఏ॥

87 ఏకతాళము.

(జల్పుష్జల్పుష్, మాదిరి)

ప్రార్థించెదమునిన్ను పరమేశ్వరీ । యూ । అర్థులబ్రోవుమఅఖిలేశ్వరీ॥ ప్రా॥ అజ్ఞానమును ద్రోసిబుద్ధియును । మాకు । సుజ్ఞానమునుయొసగూర్చగను॥ ప్రా॥ కామసంజీవని కామేశ్వరీ। కామితార్థములిమ్ముగౌరీశ్వరీ॥ ప్రా॥ మోదంబుగూర్చుమము క్తేశ్వరి । ఖేదంబుబాపుమఖలసంహారి॥ ప్రా॥ కాదంబినిప్రియవనవాసినీ। వాదంబుగాదిదివరదాయినీ॥ ప్రా॥ లక్ష్మీనారాయణప్రియతాపదా। సాక్షిస్వరూపిణినాసర్వదా॥ప్రా॥

88 తోడిరాగం - ఆదితాళము.

(గంగాధరా, మెట్టు)

శ్రీశాంకరీదేవిబ్రోవుమా । భక్త । చిత్తవిహారిణిగావుమా॥ శ్రీ॥ పాశాంకుశధారిశ్రీయుమా । పతిత । పావనిమానిమందారమా। ఆశపాశములనుద్రోయుమా । నన్ను । ఆదరించకరుణాగాంచుమా॥ శ్రీ॥ శ్రీమహానగరనివాసినీ । వర । శ్రీమహాచింతామణిస్థనీ । కామదగ్ధసంజీవనీ । మహా । కామరూపిణిజగత్కారిణి॥ శ్రీ॥ ధర్మాధర్మవివర్జితా । దనుజ । మర్మవిచ్ఛేదనమునినుతా । ధర్మసంవర్ధనిశైలసుత । పరమ । ధర్మజ్ఞాదుర్మదాహారి॥ శ్రీ॥ ధరభావనగరవిహారిణి। వరవేం।

కటలక్ష్మీనారాయణావని । సారససమదళవిలోచని । వర ।
త్రిపురసుందరిసాధ్వీమణీ॥ శ్రీ॥

89 (శ్రీ రాగ్ధిదరిశేరి, శైలి)

శ్రీబాలత్రిపురసుందరిబ్రోవజనుమా । సౌభాగ్యనివి
నుమా । మమప్రార్థనగానుమా॥ శ్రీ॥ సంధ్యాస్వరూపిణిశం
కరుతరుణి । త్రిమాతృస్వరూపిణీ । త్రిభువనాధారిణీ॥ శ్రీ॥
అండజగమనవఖండలావరణ । కుండలికర్ణాభరణ । బ్రహ్మాం
డపాలన॥ శ్రీ॥ బాపట్లపురదివ్యభవ్యసద్విహారి । పాపసంహారి ।
పరమోపకారీ॥ శ్రీ॥ వెంకటలక్ష్మీనారాయణవినుత । కరుణా
రసాన్వితా । కామితఫలప్రదా॥ శ్రీ॥

90. కళ్యాణిరాగం - రూపకము.

భక్తాకల్పద్రుమవుమా । భజియించెదర్గనుమా ।
ముక్తిస్వరూపిణిపావని । మౌక్తికధారిణిమానిని । యుక్తాయు
క్తపరిజ్ఞానిని । యురగతతివిభూషధారిణి । శక్తిరూపస్వప్రకా
శిని । సంగీతరసాహ్లాదిని॥ భ॥ కామాకామేశ్వరినిత్యకళ్యాణీ
కరుణావని । సోమేశ్వరుప్రియరాణి । శాంభవిసకలైశ్వర్యిణి॥
కామరూపిణీసువాసిని । కారుణ్యామృతలోచని । కామదగ్ధ
వరసంజీవని । కాదంబవనవాసిని॥ భ॥ భావపురనివాసినిసౌ
భాగ్యసంప్రదాయినీ । అవనిఘూలిసుబ్బరాయ । ప్రణుతాం
ఘ్రియుగళజనని॥ సేవకజనచింతామణి । శ్రీచక్రాంచితరూపిణి।
భవభయరిపుసంహారిణి । భాసురగుణవరదాయిని॥ భ॥

## మంగళహారతులు.

### 91. హిందుస్తానికాఫి - రూపకము.

(శాంతముఖనిరంతరము, వలె)

గౌరిత్రిపురహారిసౌకుమారిహారతి । వారిజారిధారిణీ ప్రసన్నపార్వతీ॥ గౌ॥ రాజరాజశేఖరీప్రమామహేశ్వరీ । పూజితప్రసత్తిపతితపావనీశ్వరీ॥ గౌ॥ క్రూరదనుజనాశనీకృపాకటాక్షిణీ । నారదాదిమౌనివినుతనతవిభూషిణీ॥ గౌ॥ పుండరీకలోచనీప్రచండవేషణీ । కుండలీంద్రభూషతరుణికుటిలహారిణీ॥ గౌ॥ భావపురవిహారిణీ । సేవితాంఘ్రిజలజ సుబ్బయాఖ్యపోషిణీ॥ గౌ॥

### 92. హిందుస్తాని.

(కైసీవసంతెహైశాక్, మట్టు)

సుందారి జయహారతీ । శ్రీబాలాత్రిపుర॥ సుం॥ కుందరదనరాకేందువదనముని । వందితపదపంకజా । గౌరీ । వందితపదపంకజా॥ శ్రీబాలాత్రిపుర॥ సుం॥ రాజరాజేశ్వరి । రజితగిరీశ్వరీ । పూజితభువనేశ్వరీ । శ్రీబాలాత్రిపుర॥సుం॥ వేదాంతవేదిని । విమలావిచారిణి । సాధుజనాధారిణి॥ శ్రీబాలత్రిపుర॥ సుం॥ వెంకటలక్ష్మీనారాయణశర్మహృత్పంకేజదళవాసినీ। శ్రీబాలాత్రిపుర॥ సుం॥

### 93. (హారతివ్వరారె కేగమె, మాదిరి,)

కర్పూరంపుహారతివరెగాటికిమ్యోదరా । సర్వతతివిభూషిణికందర్పప్రాణదాయికి॥ క॥ వార్పుమీరగ । నేర్పుతోడు

రీ । కర్పూరగంధియలు అతులదర్పమెచ్చురగ॥ క॥ హిమగిరీంద్రపుత్రికే । సోమసూర్యనేత్రికే । సామగానలోలశీల । శుభదగాత్రికే॥ క॥ యోగిసంఘపోషికే । భోగితాంగభూషికే । ఆగమాంతరూపిణీసద్విమలభాషికే॥ క॥ భావపురవిహారికే। భవభయసంహారికే । భవమనోజ్జవిహారభ్రమరిభాసురాంగికే॥ క॥ సుజనజనవినోదికే । సుబ్బరాయపోషికే। రజితగిరినివాసినిశ్రీరమ్యవేషికే॥ క॥

## 94. హిందుస్తానిరాగం

(కాటుగయూభిమవా, మట్టు)

సుందరిహారతిదే । శ్రీబాలాత్రిపుర॥ సు॥ మందగమసజితమత్తమరాళీ । ఇందుకళాభరణీ । శ్రీబాలాత్రిపుర॥ సుం॥ ఆదిశక్తిపరంజ్యోత్యఖిలాత్మకి । వేదవేదాంతసుఖీ । శ్రీబాలాత్రిపుర॥ సు॥ ఘోరపాపసంహారిజగధీశ్వరి । హారకిరీటధరీ । శ్రీబాలాత్రిపుర॥ సుం॥ బావపురీశ్వరి । భాగ్యవిద్యేశ్వరి । శివమనోజ్జవిహారి । శ్రీబాలాత్రిపుర॥ సుం॥ వెంకటలక్ష్మనారాయణస్తుతిపదా । పంకజనయనసదా । శ్రీబాలాత్రిపుర॥ సుం॥

## 95. హిందుస్తాని.

(ఆరెవంయ్యా, ఘణిత)

జారీజారీ । ధారిణిరిపుసంహారి । హారాతిదేకొమారి॥ వా॥ గౌరీ । బాలాత్రిపురసుందరి । దానవమదసంహారి । మ

హిమాసురవధకారి । సుకుమారి । అఘహారి । నయచారి । భయహారి॥ వా॥ అంబ । సద్గుణమణికదంబ । దేవగణనికరంబ । సేవకజనఫలదాంబ । భ్రమరాంబ । సుగుణాంబ । జగదాంబ । జ్ఞానాంబ॥ వా॥ ఏణి । లోచనినీలవేణి । సోమేశ్వరునిరాణి । లలితపల్లవపాణి । శుకవాణి । శుశ్రోణి । కలవాణి । కళ్యాణి॥ వా॥ చాల । బాపట్లపురవరిపాల । కరుణాలతాలవాల । కనకాద్రినిలయశీల । శుభలీలా । సురపాల । గుణజాల । గిరిబాలా॥ వా॥

96. రూపకము.

(కోటికినీగుణముదలిపెరా, వలె)

హారతిశ్రీత్రిపురసుందరీగారి । సూరిజనమందారినయవిచారికౌమారీగారి॥ హా॥ పరమపతితపావనివరదాయనీమణిగారి । చారుగుణవిశేషణసన్మానిపోషణిగారి॥ హా॥ సురుచిరమణిమయకిరీటహారధారిణీగారి । పరగహిమగిరీంద్రతనయసరసభామణీగారి॥ హా॥ విరివిగబాపట్లపురనివాసినీశ్వరీగారి । అరయవెంకటలక్ష్మి నారాయణహృద్గోచరీగారి॥ హా॥

97. ఖమాసు - ఏకతాళము.

(శ్రీ, వి, ఘ్న, శా, సైలి)

శ్రీ, శ్వే, తా, ద్రి, తనయసుగుణసదయహారతి । సమ్యగాకృతీ । సాధుసన్నుతీ॥ శ్రీ॥ వే, దా, వే, దాం, తార్థవేదివిశ్వరూపిణీ । భోగిభూషణి । భక్తతోషణీ॥ శ్రీ॥ భా,

వా. పు, రీ, నిలయత్రిపురసుందరీశ్వరీ । భవమనోహారీ । పాపసంహారి॥ శ్రీ॥ ల, క్ష్మీ, నా, రా, యణమనోబ్జవిహారమట్పదా । దేవనుతపదా । దివ్యమణిసదా॥ శ్రీ॥

## 98. హిందుస్తానితోడి - ఆట.

(పూలూగోతామునాశే, మట్టు)

మంగాళహారతిదే । ఓ బాలాత్రిపురసుందారికౌమారి॥ మం॥ భృంగివినుతజగన్మంగళకరఅఘ । భంగా । శుభాంగా । భక్తాంతరంగజయ॥ మం॥ అండజగమనమార్తాండసన్నిభపర । భండన ఖండన । కుండలిభూషణ॥ మం॥ స్థిరముగ బాపట్లపురవరమందిర । వర వెంకటలక్ష్మి నారాయణార్చిత॥ మం॥

## 99. కన్నడం

(హెళి గాయతి చెళగొమ, ఝకె)

శుభమంగాళహారతిగౌరీ । శ్రీబాలాత్రిపురసుందరికౌమారి॥ శు॥ వేదవినోదిని । విమలవిచారిణి । సాధుజనావని । సారసలోచని॥ శు॥ ఆగమరూపిణి । యోగిసంతోషిణి । భోగివిభూషిణి । రోగసంహారిణి॥ శు॥ మౌక్తిక ధారిణి । ముక్తిప్రదాయిని । శక్తిస్వరూపిణి । భక్తజనావని॥ శు॥ శంకరిభువనశ్లాఘినిజగన్నాత । వెంకటలక్ష్మినారాయణవినుత॥ శు॥

### 100. హిందుస్తాని నాగవరాళి—రూపకము.

(మురారిదేవతానుతా శైలి.)

ధరాధరేంద్రతనయసుగుణసదయహారతీ। అతులశు। భకృతీ। అతిదయామతీ॥ ధ॥ అకార్యకార్యకారిణీయమోఘ రూపిణీ। అఖలపావనీ। హారధారిణీ॥ ధ॥ అశేషభువనమోహినీ మహావిరాగిణీ। అసురమర్దనీ। అతిపవిత్రాపినీ॥ ధ॥ భావపురనివేశ్వరీ శ్రీత్రిభువనేశ్వరీ। పాపసంహారీ। త్రిపుర సుందరీ॥ ధ॥

### 101. శంకరాభరణము—ఏకతాళము.

(బా, లి, కా, మణిరం, ఫణితి)

ఫా, లా, త్రూ, తరుణీ। లలి। పల్లవాపాణి। హార తియిదె॥ ఫా॥ బాలాత్రిపురసుందరీగుణజాలా। మానిలోల॥ ఫా॥ సుందరాననా। పరమా। నందపావన। మందగమన సనందనాదిమునివంద। నీయఘన॥ ఫా॥ పతితపావనీ। సతీ। శ్రితజనావని। మాతా కారుణ్యపూతా। శ్వేతాద్రిజాతా। నతజనహిత॥ ఫా॥ భవ్యస్వభావా। శివా। దివ్యప్రభావా। భవ్యపురజనసేవ్య జనహితకావ్యరచననిపుణ॥ ఫా॥ పంకజేక్ష ణి। అక। శంకమానిని। వెంకటాలక్ష్మీనారాయణాఖ్యశంక। పరిహారిణి॥ ఫా॥

### 102. భైరవిరాగం—ఆదితాళము.

(మంగళంబునీకు, మాదిరి)

మంగళంబు బాలాత్రిపురసుందరీ। మంగళాంగిమహా

మాయిభువనేశ్వరీ॥ మం॥ నిర్వికల్పనిరాబాధానిర్భేదా । స ర్వయంత్రాత్మికీ । సద్గతిఫలప్రదా॥ మం॥ శ్రీమత్సింహాసనే శ్వరీమృడాని శ్రీమహాయోగీశ్వరేశ్వరీభవాని ॥ మం॥ కలిక ల్మషవినాశనీశ్వరీ । లీలావిగ్రహధారిణి త్రిదశేశ్వరి॥ మం॥ శాంకరిబాపట్లధామసద్వ్రతా । వెంకటలక్ష్మీనారాయణస న్నుత ॥ మం॥

## 103. హిందుస్తాని కాఫీ—రూపకము.

(హేదేవీ, మొస్తరు)

శ్రీబాలా । త్రిపురసుందరీమహేశ్వరీ । హారతీయిదే। నిరుపమోన్నతే॥శ్రీ॥ శర్వాణీ।సాధులోకసంరక్షణీ। దయా రసేక్షణీ। దనుజశిక్షణీ॥శ్రీ॥కల్యాణి। కాదంబరీప్రియాకలావతీ। సారసాకృతీ। సాధుసత్కృతీ॥ శ్రీ॥ శ్రీభావాపురవిహారభాగ్య దాయినీ । రిపువినాశనీ । శ్రీసువాసినీ॥ శ్రీ॥ లక్ష్మీనా । రా యణాఖ్యహృదయవందితా । త్రిజగన్నుతా । త్రినయనుసతి సదా॥ శ్రీ॥

## 104. (హారతియిదె, మాదిరి)

మంగళమిదె శుభమంగళగౌరీ। మంగళదాయిని మాలి నికౌమారి । మం ॥ కామకామేశ్వరి । కనకగిరీశ్వరీ । కామి తార్థదాయినిసర్వేశ్వరీ ॥ మం ॥ శ్రీమదాజరాజేశ్వరియాశ్వ రి.। శ్రీమత్సింహాసనపీఠేశ్వరీ ॥ మం ॥ భావపురాంతరసౌధ విహారిణి । సేవకజనసమ్మోదినిమానిని ॥ మం ॥ శాంకరిశ్రీ త్రిపురసుందరిలలితా। వెంకటలక్ష్మీనారాయణవినుతా॥ మం॥

105. (వందనము రాగము, మట్టు)

హారతి గైకొనుమా । అద్రితనయశ్రీయుమా॥ హా॥
వరదాయిని । గుణదాయిని । అనపాయిని శ్రీమానినీసారా ।
సాక్షీ । శత్రు । శిక్షీ । సరసవచనరచననిపుణ । సురగణము
నివినుతచరణ॥ హా॥ తాపసమానసమందిర । దానవలోకభ
యంకర । పాపవినాశనీపంకజలోచని । బాపట్లపురనిలయభ
వ్యవిలాసినీ॥ హా॥ కరుణా । కరిశ్రీ । కరిభువనేశ్వరిపరమము
నీశ్వరి॥ హా॥ శూలినిపాపనిర్మూలినిపావని । పాలితాఖిలభువ
నిపరశంభుమోహిని । నలినవాభునిసోదరీమహామాయిని ।
ఘూలిసుబ్బారాయకవిదాసవందని॥ హా॥

106. బ్యాగ్ - త్రి. ఏకతాళము.

మంగళమనిపాడరే । మానినులిటుగూడరే॥ మం॥ అం
గజపాప్రిణసంజీవనికీ । మంగళాంగిశివుమానినికీ । రంగుగను ।
పొంగుచును । సంగతిమీరసుపసంగములతో॥ మం॥ బంగా
రుపళ్ళెరములుబట్టికేల । పచ్చకర్పూరము వెలిగించిచాల ।
రంగుగను । పొంగుచును । సంగతిమీరసుపసంగములతో॥
మం॥ భంగవినాశనిబాలాత్రిపుర । సుందరిబాపట్లనిలయగా
రికి । రంగుగను । పొంగుచును । సంగతిమీరసుపసంగము
లతో॥ మం॥

107 హిందుస్తానికాఫి - ఆదితాళము.

(త్రిగళోత్కటమధుపాతియారె, మాదిరి)

జయభారతిదిగ్భోళవాసి । భయపాపహారిణీమృడాని॥

జ॥ బృందారకాదివంద్యపాద । ఇందుకళాభరణీవినోద॥ జ॥ కరుణాంబురాశిగానలోల । పరమమానిపోషిణీసుశీల॥ జ॥ సాక్షిస్వరూపిణిసుచరితా। లక్ష్మీనారాయణాఖ్యసంస్తుతా॥ జ॥

108 హరికాంభోజి _ ఏకతాళము.

మంగళహారతిదే । మంగళాలయాసతీ॥ మం॥ అంగజ ప్రాణసంజీవనదాయని । సంగభంగశుభాంగిశ్రీమాలినీ । కరుణా । వనీ । కాత్యా । యనీ॥ మం॥ ధారుణిబాపట్లధామ గిరీశ్వరీ । పరమపతితపావనిపరమేశ్వరీ । పరమదయాకరీ । భక్తవశీకరీ॥ మం॥ బాలాత్రిపురసుందరికౌమారి । ఘాలిసుబ్బారాయాఖ్యహృద్గోచరి । నలినవిలోచనీ । యఖిలసమ్మోహినీ॥ మం॥

—♦ గద్య ♦—

ఇది శ్రీమద్ఘాలివంశపయః పారావారకైరవమిత్ర, భారద్వాజ సగోత్రపవిత్ర, ఆపస్తంభసూత్ర, ఆదిమూర్తి పౌత్ర, కోదండరామసుధీమణి ద్వితీయపుత్ర, పిచ్చయాఖ్యదత్తపుత్ర, రామారావు సత్యనారాయణరావు, మధ్యసోదర, సుజన విధేయ, సుబ్బరాయనామధేయ, ప్రణీతంబైన, గౌరీశ్వరపూజా విధానసంకీర్తనలు, అను గ్రంథము, సర్వము, సంపూర్ణము.



